# నర్తనశాల

(ఏకాంకి నాటికలు)

రచన: శ్రీ జోగిరాజు చౌదరి

ఇందు

"నర్తనశాల" "జీవనరేఖ" అను
రెండు ప్రేమరసమయ నాటికలు
ఇందు హృదయానందకరమగు ఘట్టాలు
తియ్యని పాటలు
గంభీరమైన సంభాషణలు
రసవంతమైన ఘటనలు
చక్కని చిత్రాలు
మనోహరమైన భావాలు

ప్రదర్శనాని కనుకూలం.

మూల్యం 1 రూపాయి

ముందుగా డబ్బు మనీయార్డరుద్వారా పంపువారికే
పంపబడును.

ప్రాప్తిస్థానము:

కాళహస్తి తమ్మారావు అండు సన్సు
సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమహేంద్రవరం

# దీవార్ - రాత్రిగోడ

## ( పన్నెండు దృశ్యాల నాటకము )

△

నాటక — నిర్మాత

పంచభాషాప్రవీణ — విద్వాన్

**శ్రీ ఆయిలావఝ్ఝుల సూర్యప్రకాశ శర్మ** *B. A. B. Ed.*

△

గేయ రచయిత

కవికుమార — కవితావిశారద,

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు.

△

ప్రకటనకర్తలు

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు**

సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమహేంద్రవరము.

# పాత్ర సమూహం

**పురుషులు** | **స్త్రీలు**

| | | | |
|---|---|---|---|
| రామసింగ్ : | కథానాయకుడు | జానకి : | రామసింగ్ భార్య |
| సేర్‌సింగ్ : | రామసింగ్ సోదరుడు | గ్యానీ : | సేర్ సింగ్ భార్య |
| గాలవుడు : | యోగిపుంగవుడు | శాంత : | ఘోష్ భార్య |
| ఘోష్ : | విదేశీయుడు | ఉష : | దాసు భార్య |
| మోతీచంద్ : | రైతు | | |
| దాసు : | సేవకుడు | | |
| పండిత్ జీ : | సంగీతవిద్వాంసుడు | | |

# సమూహ సంగీతము

౧ (గేయం)

ఆశ్రితజనవరదా మము
ఆదరింప విది బిరుదా !

కాంచనచేలా ! ఘనమణిమాలా !
పంచచేరితిమి శ్రీకాంతాములా ! ॥ఆశ్రిత॥

దాసుడనని దరిజేరినవారిని
ఆసమీరగా కాపాడితివే
శ్రీసమేత ! మునివందితచరిత !
నీ సమానమిక లేరు ! సురార్చిత !

౨ (గేయం)

మా భారత జనసంతతి
మహిత పాదంబులకు
మమతలూరగ నేడు
మల్లెపూదండల నైతు

నే భరతపుత్రుండను
యీ దివ్యదేశీయుడన్

మా త్యాగరాయనికి
మంగళంబులపాడి
మా దేశవిభవంబు
ముదమార దెల్పెదను

నే భరత పుత్రుండను
యీ దివ్యదేశీయుడన్

బోసుబాబున కెపుడు
పూజారినయ్యెదను
ఆంధ్ర కేసరి కెపుడు
అంజలించెదను

నే భరతపుత్రుండన్
యీ దివ్యదేశీయుడన్

యుగమహాపురుషుడౌ
యీ గాంధిదేవునకు !
తులలేని జవహర్లాలునకు
దోసిలొగ్గెదను !

నే భరతపుత్రుండను
యీ దివ్యదేశీయుడన్

సర్వజాతుల కెపుడు
శాంతిసఖ్యతగూడ
ఆదిశక్తిని సతము
అభినుతించెదను

నే భరతపుత్రుండను
యీ దివ్యదేశీయుడన్

# దీపావళి ద్రాక్షారామగోడ

## ఒకటవదృశ్యము

### భారతపూజ

గేయం

భారతమాతా శూరసమేతా! భవ్యాశయ భరితా!
వీరకుమారా విభవోపేతా! విశ్వవిఖ్యాతా వినుతామాతా!
వింధ్యహిమాచాల నగవిఖ్యాతా
విమలజాహ్నవీ నదసంశోభిత
విశ్వసంపూత వైభవచరితా
వీరవందితా ప్రణుతామాతా
భారతమాతా శూరసమేతా భవ్యాశయ భరితా
వీరకుమార విభవోపేతా! విశ్వవిఖ్యాతా వినుతామాతా!
కమనీయవన్య సముపేతా
సుమనోహర సుప్రభాతా
మకరందతుల్య మధుభాషా
ప్రణతోస్మి మంగళవిభూషా!
భారతమాతా శూరసమేతా భవ్యాశయ భరితా!
వీరకుమార విభవోపేతా! విశ్వవిఖ్యాతా! వినుతామాతా!

(ప్రసాదా లిచ్చినతర్వాత)

గా॥ వృద్ధు :—రామసింగ్ నృపాలుని జీవితము ధన్యమైంది. ప్రజలను సేవిస్తూ భగవంతుణ్ణి దర్శిస్తాడు. కాని, అతని నెత్తిమీద

మాత్రము హేమకిరీటముంది. అది కలియుగపురుషుని కల్పి
తమైన లోహసాధము. ఆ సంగతి మరచిపోగూడదు,

భయద కంఠీరవాస్య గహ్వరమునందు
కంధరం బిడి లోకుల కబ్బురంబు
గూర్చు వీరుని విధమున నుతలపతియు
హేమ మకుటంబు దాల్చి చూపించు ప్రజ్ఞ.

రామసింగ్: శివునిశిరముమీద దోషాకరుడు నాట్యముచేస్తున్నా
అతని సర్వజ్ఞత్వానికి లోటులేదు.

గాల:—జానకీ! నీవు జగజ్జననివి నీకు చెప్పవలసిన ధర్మసూత్రాలు
లేవు భర్త శ్రీరామచంద్రుడు. ఆతని శక్తి అతనికి తెలి
యదు. ఆ అజ్ఞానమువలన బాధపడుతుంటాడు. జ్ఞాపకము
చేస్తుండు. మూర్ఛను మృత్యువని భ్రమించి మృతసంజీవినికి
హడావిడి చేస్తాడు.

ప్రకృతి ఛేదించి సత్యంబు బయటబెట్టు
శక్తి లేనట్టి పతిచెంత! సాధ్వి నిల్చి
సత్యమును జూపకున్నచో! జగమె కుంగు,
చీల్చి చూపి నిజంబును రక్షింపుమమ్మ

జానకి:—(నవ్వుతూ) పెద్దల ఆశీర్వచన మున్నంతవఱకు భయము లేదు.

గాల:—సేర్‌సింగు స్త్రీలలో అమృతము, విషము హృద్యముగా
సమ్మిళితమైనాయి. విషాన్ని తొలగించి అమృతాన్ని స్వీకరించే
వాడే ధన్యుడు, జాగ్రత్త!

సుధను విషమును సృష్టించి చొన్ని జలధి
వేఱు వేఱుగ వ్యాపింప! విసుగుజెంది
వాని నొకచోట నిల్పి కాపాడ సతము
కమలలోచన సృష్టించె! కమలసుతుడు.

సేర్ :—శ్రీరామచంద్రుని ఆశ్రయించిన లక్ష్మణునకు ఆకలి దప్పి కలే లేనప్పుడు ఊర్మిళవలన సౌఖ్యముకాని, శూర్పణఖవలన దుఃఖముకాని ఉండదు.

రామ :—శ్రీరామచంద్రునకు లక్ష్మణునకు మధ్య జానకి వస్తే '

గాల :—(నవ్వుతూ) అవసరమైనప్పుడు తొలగిపోతుంది కాని. శూర్పణఖ అయితేమాత్రము ప్రమాదము.

సేర్ :—ప్రమాద మే ముంది ; ముక్కు చెవులు తెగి వేయబడి పోతోంది.

గాల :—ఝాన్సీ ! సముద్రగర్భములో దాగి ఉన్న రత్నాలకాంతిని లోక మనుభవించి ఆనందించలేదు. పతి తప్పుదారిలో వెళ్లుతున్నప్పుడు ఆతనిని శాసించే అధికారము భార్య కుంది.

ధర్మసూక్ష్మంబు లెఱుగక తప్పుదారి
సాంప్రదాయాల వెంటాడి ! చనుట సతికి
లక్షణము కాదు, వలసిన బీ్రతింప్రుటించి
పోరు నామెయె భారత పుణ్యసాధ్వి.

సేర్ :—గురువుగారు కొంపముంచేస్తున్నారు. మొండిచేతులవాని కనుములు తింటం నేర్పుతున్నారు.

గాల :—అనుభవముకల బెస్తా చేపలులేనిచోట గాలము వెయ్యడు.

జానకి :—(నవ్వుతూ) అంటే మా మరది జాగ్రత్తగా ఉండాలని చెప్పుతున్నారా !

గాల :—అమ్మా ! నీ వాక్యాలకు భాష్యము వ్రాసేభాగ్యము భారత దేశానికిలేదు. మహావేదాంతులకు కూడ నీ మాట లర్థముకావు రామసింగ్ జ్ఞాపకముంచుకో ! ప్రజాసేవకే నృపాలుడు జన్మించాడు భోగభాగ్యా లనుభవించటానికి కాదు. భోగభాగ్యాల మీాద దృష్టిపడిన దేశము అనతికాలములోనే స్వాతంత్ర్యాన్ని

పోగొట్టుకొని దాస్యానికి తలలొగ్గుతుంది. పతివ్రతలను పరాభవించి కామినీగణము వెంటబడిన దేశ మష్టకష్టాలకు లోనై యీతిబాధలకు నాట్యరంగ మవుతుంది. జ్ఞాపకముంచుకో !

ప్రజల రక్షింప రాజు సువర్ణమకుట
మాత్మశిరమున దాల్చు, భాగ్యాలవెంట
నంటి కామిని సేవించు నవనిదాస్య
మష్టకష్టాలు క్రీడించు ! నరయు మిదియ.

రాము :—మీ హితబోధను గీతారహస్యముగా స్వీకరిస్తున్నాను.

(అని నమస్కరించును)

గాల :—సేర్ సింగ్ జ్ఞాపకముంచుకో ! ప్రపంచములో దేనినైనా సంపాదింపగలవు. కాని, ఏకగర్భజనితుడైన సోదరుణ్ణి సంపాదింపలేవు.

సేర్ :—మేఘానికి వర్షించటము నేర్పుతున్నారు. మీ వాత్సల్యానికి నమస్కారము.

గాల :—(నవ్వుతూ) ఉడికే ఉడికే పాలు.

గేయం

వృథావిచారము మానవెజీవా
వ్యథలబొగులనేలా !
సుఖదుఃఖంబులసముదాయంబే
జగతీలీలగదా !
పరమేశ్వరుని పదభజనంబే
సర్వసౌఖ్యదాయి !
వృథావిచారము మానవెజీవా
వ్యథలబొగులనేలా

(భగవంతుని ధ్యానముచేస్తూ వెడలిపోవును.)

(సేర్ సింగు ఝూగ్సి, రామసింగు దంపతులకు నమస్కరించి వెడలిపోవును.)

జానకి :— మా చెల్లెలను చూశారా! భర్తను నీడమోస్తరుగా వెంటాడుతోంది.

రాము :— ఆ మౌనములో భయంకర మాహాత్మ్యముంది. సామాన్య దృష్టి కందక స్వేచ్ఛగా ప్రవహిస్తూ అవసరమైనప్పుడు అగ్ని పర్వతమై వెలుపలకు వచ్చే భూగర్భస్థ ప్రజ్వలాగ్ని ఆ మౌనములో నిగూఢముగా దాగిఉంది.

జానకి :— అగ్నికి వాయువు అన్నో తమ్ముడో తేల్చలేము.

రాము :— వాళ్ళిద్దరు భార్యా భర్త లని నా నమ్మకము.

జానకి :— (నవ్వుతో) అనుభవజ్ఞులు.

(తెర వ్రాలును)

# దీపావళి రాత్రిగోల

## రెండవదృశ్యము

(జానకి రామాయణము చదువుచుండును. రామసింగ్
వ్యాఖ్యానము చేయుచుండును)
(ఇంతలో మోతీచందు ప్రవేశించును)

రామ:— రావోయి మోతీచందు! ఏమిటి విశేషాలు?

జానకి:— కూర్చో! ఇంట్లో పిల్లా మేక కులాసాగా ఉన్నారా?
(మోతీచందు నవ్వుతూ) ఉన్నారండి! కామందుల దయ ఉంటే మాకు లోటేమిటి!

రామ:— ఏమిటి ఇల్లాగ కొట్టుకొని వచ్చావు!

మోతీ:— ఈ మధ్య మా గేదె యీనిందండి. జున్ను తెచ్చానండి.

రామ:— ఓరి పిచ్చాడా! ఇంతదూరము కష్టపడి తీసికొని రావాలా!

మోతీ:— మా ఆడది చంపివేసిందండి. జానకమ్మగారు తింటే కాని, తనకు మనస్సొప్పదని నన్ను చంపింది.

జానకి:— అయితే అయ్యగారి కిందులో వాటా లేదన్నమాట!

మోతీ:— ఎంతమాట సెలవిచ్చారు! వారిపేరు చెప్పుకునే మేము దీపము వెలిగించుకొంటున్నాము. ఈ ధర్మమూర్తి ఆ మధ్య తగాదాలలో జోక్యము కలగచేసికోకపోతే మా గతి యేమయ్యేది? వెధవజున్ను! మా చర్మముతో చెప్పులు కుట్టి యిచ్చినా వారి ఋణము తీరదు. అన్నట్టు - అడగటం మరచిపోయాను! చిన్నబాబయ్యగారు కనబడటము లేదేమండి?

జానకి :—చిన్నబాబయ్యగారికి చిన్నమ్మగారు దొరికారు, వారిద్దరీ ప్రపంచాన్నే మరచిపోయారు.

చం :—ఎంతమాట సెలవిచ్చారు! అయినా, చిన్నమ్మగారి దారే వేరు. ప్రపంచమువిూద ప్రపంచము ఉన్నా జంకరు, వొణకరు, బెణకరు.

జానకి :—చందూ! చిన్నమ్మగారి నెప్పుడైనా చూచావా?

రామ :—పెద్దమ్మగారిలాగు చిన్నమ్మగారు కనపడరుకదా!

జానకి :—పెద్దన్నయ్యగారి వెంట పెద్దమ్మ ఉంటుంది కనక అందరికి కనబడుతుంది.

(సేర్‌సింగు ప్రవేశించును)

ఏం, చందూ! ఇల్లాగ కొట్టుకొని వచ్చావు? మళ్ళీ యేమన్నా కత్తులు కత్తులు రాపాడుతున్నాయా! చెప్పు ఈ సారి చిన్నబాబయ్యగారు వస్తా రని.

జానకి :—(నవ్వుతూ) విూ అన్నయ్యకు జున్ను తెచ్చాడు.

సేర్ :—ఓరి నీ ఇల్లు బంగారముకాను' నాకు తేగలు తెచ్చావా!

(అందరు నవ్వుదురు)

రామ :—చిన్నబాబయ్యగారిని చూచావు కదూ! వెళ్ళి విశ్రాంతి తీసికో!

(అందరికి నమస్కరించి మోతీచంద్ వెడలిపోవును)

(సంగీతవిద్వాంసుడు ప్రవేశించును)

(అందరు నమస్కరించెదరు)

రామ :—రండి శాస్త్రిగారూ! (అని ఉచితాసన మొసంగును)

సంగీత :—(కూర్చొని) ప్రభూ! నేననేక రాజాస్థానాలలో నా విద్యను ప్రదర్శించాను. సత్కారాలు పొందాను కాని, నా ప్రతిభను మెచ్చి ఆనందించి సత్కరించే భూపాలుణ్ణి నేను

చూడలేదు. కనుక, పొందిన సత్కారాల కానందించక దేశాట
నము చేస్తున్నాను. మా అపారపాండిత్యాన్ని కవిహృదయాన్ని
రసికత్వాన్ని యాచకులు పొగుడుతుంటే నా కోర్కె నెరవేరు
తుందికదా ! మీ దర్శనానికి వచ్చాను. నా కవకాశ మిస్తారని
ఆశించి ప్రార్థిస్తున్నాను.

పండితులు కష్ట సుఖములు ప్రజ్ఞ ప్రతిభ
స్వానుభవమున నెఱిగి తత్ స్తవముచేయు
వాని యొకమాటయైన సర్వం సహాత్మ
వెలయు రత్నాల మించు ప్రాపించు ముదము.

రామ :—నేడు సుదినము.

(జానకి వెండిపళ్లెరములో తాంబూల ముంచి శాస్త్రి కంది
చ్చును. దానిని స్వీకరించి, రాగ మాలాపించి యొక కృతి
పాడును.

రాగం - దేవమనోహరి

పలుకవేమిరా ప్రియ మారగనాతో ॥ ప ॥
పలికితే కెంపులు రాలిపోవునా ॥ ప ॥
సరసుడవనినీ సరసజేరితిని
మురిపెముతో నాదరి జేరెదవని ॥ ప ॥
ఆనందించుటకే యవనిబ్రతుకు
ఆలస్యము ఇంకేలరాప్రియా !
ననువిడెదవో న్యాయముకాదు
మనమానగ గను చరణదాసినిర ! ॥ ప ॥

రామ :—పండిత్ జీ ! మీ యమృతగానముతో కాలగర్భములో లీన
మైన మధుర రవాలను, ప్రకృతిని పరవశ్ళ త్రొక్కించే
మధుర నినాదాలను వినిపించారు. ధన్యవాదాలు.

సంగీత :—నాయనా ! భారతి విధముగా ఈ అమ్మ, చతురాననుని భంగి మీరు నా సంగీతవిద్య ననుభవించి నా విద్యకు నూత్న శక్తి నాపాదించారు. నేడు నేను ప్రదర్శించిన విద్యకు నేనే ఆశ్చర్యమొందుతున్నాను,

సేర్ :—పండిత్ జీ! తాన్‌సేను సంగీతములో అత్యున్నతస్థాన మాక్ర మించా డని విశ్వసించి దాన్నే స్మరిస్తూ ఆనందించటముకంటె మీ రా సంగీతాన్ని ఇంకొక మెట్టు పైకి లాగుతే మంచిదని నా అభిప్రాయము.

పండి :—నాయనా ! అది సాధ్యము కాదు. సద్గురు కటాక్షమువలన జడప్రకృతినే వెల్లులెత్తించే తాన్ సేన్ యెక్కడ ! మనబోటి సామాన్యమానవు లెక్కడ ! తాన్ సేను నర్థముచేసికొనటమే దుర్లభము. అనుకరించటము పూర్వజన్మసుకృత ఫలము. అతిశయించటము భగవంతుని యిచ్ఛకాదు.

సేర్ :—పూర్వము భోజమహారాజు పండితులను సత్కరించటము మాని కవులను పోషించేవాడు. ఆ విధముగనే మా అన్నగారు సంగీతకవులను సత్కరిస్తే కళ నూత్నమార్గాలను దొక్కి సంగీత శాస్త్రము కళగా మారిఉండును.

జానకి :—శాస్త్రము, కళ అన్నదమ్ములు అన్యోన్యాశ్రయమువలన పెంపొందుతాయి.

శాస్త్రి :—మీ అన్నగారి అభిప్రాయాన్ని నేను సరిగ్గా అర్థముచేసి కొంటే కవులను సృష్టించేది పండితు లని వారి యభిప్రాయము. పూర్వకవుల శబ్దసౌభాగ్యాన్ని యనుపమాన భావపరంపరలను జ్ఞాపకముచేస్తూ ఇంకొక అడుగు ముందుకు పొమ్మని యువకు లను ప్రోత్సహించేది పండితులే కదా!

సేర్ :—పండిత్ జీ! మీరు కవులు నమస్కారము!

పండిత్ :—నాయనా ! సృష్టికి జ్ఞానము కావాలి. పూర్వు లార్జించిన విజ్ఞాన భాండారాన్ని వశముచేసికోవాలి. దానిలోని మాధుర్యాన్ని అనుభవించి యాత్మీయము చేయాలి. అప్పుడే నూతన సృష్టి సాధ్యమవుతుంది. అందుకనే సృష్టికర్తయైన బ్రహ్మ సరస్వతీధవుడు, వేదాధిపతి యని మన ఋషులు వచించారు.

జానకి :—అయితే బ్రహ్మ కిద్దరు భార్యలా !

పండిత్ :—సంగీత సాహిత్యాల సమ్మేళనమే సరస్వతి.

(పండితులు సత్కరించెదరు.)

(తెర వాలును)

# దీపావళి రాత్రిగోల

## మూడవ దృశ్యము

(సేర్ సింగు గది)

(ఝాన్సీ నృత్యము చేయుచుండును. సేర్ సింగు హార్మో నియము వాయించుచుండును)

దూరమునుండి దాసు విడ్డూరముగ జూచుచుండును.

సుమమాలల వేసెదలేరా
మనసారగ కోరికదీరా !
సుందరరూపా రారా !
జగదియేలా సమ్మదలీలా
రాగరసమీరా - అను
రాగరసమీరా !
ప్రేమలేని జీవితమేలా
యేలా వ్యర్థసుఖంబు ! ప్రియా !
సంగీతములను బాడెదరా
సమ్మోదము గనరావేరా !

సేర్ :—ఏమిరా దాసూ ! ఇల్లాగ వచ్చావు ?

(దాసు బుఱ్ఱ గోకికొనుచు నిలువబడును)

సేర్ :—ఏమిరా మాట్లాడవు, వచ్చిన పని యేమిటి ?

దాస్ :—అయ్యో బాబూ ! జ్ఞాపకముచేసికోనివ్వండీ !

ఝూన్సీ :—(నవ్వుతూ) ఉండండి, వాణ్ణి బెదరకొట్టారే! ఆ బుజ్జిలో ఏమన్నా ఉందేమో అని తెగ వెదుకుతున్నాడు.

దాస్ :—(చేతులు జోడించి) బాబూగారూ! ఒక మనవి ; అమ్మగారి గంతులు అమ్మగారికే వస్తాయా, ఇంకెవరికైన వస్తాయా

ఝూన్సీ :—నేర్చుకొంటా వేమిటిరా!

దాస్ :—నా మొగము నా కేమి వస్తుందిలెండి, మా మనిషి ......

(సిగ్గుపడును)

సేర్ :—మీా ఉపకు నేర్పుతా వేమిటిరా ?

దాస్ :—(సిగ్గుపడును)

ఝూన్సీ :—నేర్పు వస్తుందిలే.

దాస్ :— బాబూ! తెలియక అడుగుతాను. కుంటివాళ్ళు కూడ గంతులు వేయగలరా!

సేర్ :— వాళ్ళకే ఈ విద్య! దీన్ని అభ్యసిస్తే కుంటికాళ్లు తిన్నబడుతాయి. అమ్మగారు అందుకనే నేర్చుకొన్నారు.

దాస్ :—నేను నమ్మనండి. చిన్నబాబయ్యగారి కెప్పుడు వేళాకోళాలే.

ఝూన్సీ :—నిజమేరా! సంగీతమువలన గుడ్డివాళ్ళకు కళ్లు వస్తాయి. నాట్యము వలన కుంటివాళ్ళకు కాళ్ళు వస్తాయి

దాస్ :—అయితే బాబయ్యగారికి గుడ్డి ఉందంటూరా ?

ఝూన్సీ :—లేకపోతే సంగీత మెల్లాగ పట్టుబడుతుంది ? అమ్మగారికి కాళ్ళు లేవు, బాబుగారికి కళ్ళు లేవు. హదోకబళ మమ్మా తల్లీ అని ముష్టివాళ్ళు చెప్పటము వినలేదా ?

దాస్ :—అమ్మగారుకూడ తగిన ఆవిడే (అని నవ్వుతూ వెడలిపోవును)

సేర్ :—ఝూన్సీ చూశావా! మూఢహృదయాలలోని సౌందర్య పిపాస, కళారాధన, ప్రేమ, పైకి రావటాని కెంత బాధపడుతున్నాయో!

ఝూన్సీ — జ్ఞాన మెక్కువైనకొలది సౌందర్యోపాసన మానవత్వాన్ని దాటి దైవత్వములో జేరుకొంటూ సూక్ష్మతమపంథలలో కళలనునశిస్తూ పడేబాధకంటె యెక్కువకాదని నానమ్మకము.

సేర్ :—నీవంటి కవయిత్రులు బయలుదేరితే అనుభవానికి తగిన భావము, భావానికి తగిన భాష లేక బాధపడుతుంటే దానికి సాటి యెక్కడ ఉంది.

ఝూన్సీ :—మీరు నృత్యశాస్త్రములో నూతనమార్గాలు తొక్కాలని యత్నిస్తూ సాటి వస్తారు.

సేర్ :—ఈ ఉపన్యాసాలు తర్వాత విందాము. నాకుపని ఉంది.

ఝూన్సీ :—మంచిది. పునర్దర్శనభాగ్యము !

సింగు :—ఈ నృత్యము ముగించు.

ఝూన్సీ :—మీకు తొందరపని ఉందికదూ ! తర్వాత చూద్దాము.

సింగు :— ఆ పనే తర్వాత చూచుకొంటాను. నృత్యము ముగించు.

ఝూన్సీ : —అన్నట్టు మరచిపోయాను. నాకుకూడ తొందరపని ఉంది. తర్వాత చూద్దాములెండి.

సింగు :—బెట్టుసరి యెక్కువైనకొలది పేరు ప్రతిష్టలు వృద్ధిపొందుతా యనుకొంటాను.

ఝూన్సీ :—సంగీత మంటే మీ కింత పిచ్చేమిటి ? మా బావగారి కింత మమకారము లేదు.

సింగు :—బావగారిని మరదలు, మరదలిని బావగారు మెచ్చుకొంటూ ఒక శతకము వ్రాయండి. నా కభ్యంతరము లేదు. నృత్యము ముగించు.

ఝూన్సీ :—భోగ భాగ్యాలకు లొంగిపోయినదేశము అచిరకాలము లోనే బానిసత్వాన్ని అనుభవిస్తుందని పూజ్యపాదులు గాలవ మహర్షులు చెప్పారు కనుక, మనము జాగ్రత్తగా ఉండాలి.

సేర్ :—సంగీత, నృత్యాలను ద్వేషించే దేశములో నరబలులు పెంపొందుతా యని అచటి మానవులు హంతకులవుతారని మా తాతయ్యగారుచనిపోయేటప్పుడునాతోరహస్యముగాచెప్పారు.

ఝూన్సీ :—మీ తాతయ్యగారి వేదాంతము నాకు కొంచెము చెప్పాలి. అపుడు నృత్యము ప్రారంభిస్తాను.

సేర్ :—పెంకిబుజ్జి. ఆ పెంకితనమే మానమన్నాను.

ఝూన్సీ :—అది పెంకితనము కాదు. మీ తాతయ్యగారి కవిత్వము మీముఖములోంచి వింటుంటే నాకెంతో ఆనందముకల్గుతుంది.

సేర్ :—అయితే విను,

భగవంతు సృష్టిలో పాపంబు కల్గునే
మూర్ఖుడా, వాగక బుద్ధి కనుము
సౌందర్యమున కల్మషంబును వీక్షించు
కన్నుల సరిజేయు ! గనుమ పంథ
మద్యంబు సృష్టించు మాభర్త మూర్ఖుడా
వ్యర్థసృష్టిని చేయువాడె బ్రహ్మ
సంగీత నృత్యముల్ శాస్త్రంబులే కదా
భయ మొందనేల యవ్వాని గనిన
పాప మెచ్చటూ లేదు నీ భావమందె
దాని మార్జన మొనరించి ధాతృసృష్టి
ననుభవింపుము జన్మ ధన్యం బెయనగ
మాధ్యమున కుళ్ళి పాపాల మ్రగ్గనేల.

ఝూన్సీ :—ఈ వేదాంతము మీ అన్నయ్యగారికి పట్టుబడ లేదే !

సేర్ :—ఆయనకు మా నాయనమ్మ వేదాంతము పట్టుబడింది.

ఝూన్సీ :—ఇద్దరికి భేద మేమిటి ?

సేర్ :—తర్వాత చెప్తానులే.

ఝూన్సీ :—మీరు చెప్పటం ముగిస్తే నృత్యము ప్రారంభించవచ్చును

సేర్ :—మా తాతయ్య " ఈ లోకములో హాయిగా జీవించు భగవం తుణ్ణి ప్రార్థించు. పరలోకములో ఈ భోగాలనే భోగించు సంగీత నృత్యాసే ఇహలోక పరలోకాలను సంధించేవి. సౌందర్య, సంగీత, నృత్యాలు మానవుణ్ణి పాపమునుండి రక్షించి భగవంతుని చరణాలచెంత నిల్పుతా" యంటాడు. మా నాయనమ్మ " ఈ లోకములోని భోగాలను వదులు తే కాని పరలోకము సాధ్యముకాదు. మోక్షము కావా లంటే కామినీ, కాంచనాలను వదల" మంటుంది.

(ఝాన్సి నృత్యము ప్రారంభించును)

(ఉష ప్రవేశించి) బాబూ!

ఝాన్సీ :—ఏం ఉషా! నృత్యము నేర్చుకొంటావా? కట్టు గజ్జె.

ఉష :—అమ్మగారూ! కుంటిముండను నా కెందుకీ గొడవ?

సేర్ :—మీ ఆయన నేర్పమన్నాడే.

ఉష :-(సిగ్గుతో)అన్నయ్యగారు విందుకురమ్మన్నారు(అని వెడలిపోవును)

సేర్ :—(నవ్వుతూ) ఝాన్సి! నీవుకూడా రా!

ఝాన్సి :—ఆ సమయముకూడ వస్తుందేమో! ఈ పరదాపద్ధతులను వదలి ఝాన్సి బహిరంగముగా తన భర్తతో సంచరిస్తూ విందు లనుభవించే దినాలు వస్తాయేమో!

సింగు :—అటువంటి మంచి దినా లింత చప్పున రావు. రాకూడదని భగవంతుని ఇచ్ఛ. (అని వెడలిపోవును)

ఝాన్సి :—పురుషులతో స్త్రీ లెందుకు విందులకు వెళ్ళకూడదు. ఆ మాత్రానికే పతనము కల్గుతుందా? హృదయబలము పరిస రాల ననుసరించి భగ్నమవుతుందా, మారుతుందా? పర దాలో పెట్టి బంధిస్తే పాతివ్రత్యము నిలబడుతుందా? స్త్రీ జన్మమే ఒక తీరని జటిలమైన సమస్య అయింది. (ఆలోచించు చుండును) (తెర వ్రాలును)

# దీవార్ లేక రాతిగోడ

## నాలగవ దృశ్యము

(ఘోష్, శాంత విదేశీయదుస్తులను ధరించి గాయము తగిలిన బాలకుని గొనివచ్చెదరు)

ఘోష్ :—నమస్తే! (అని జానకి కిషేక్‌హేండు నివ్వబోవును. ఆమె భయముతో వెనుకకు జంకును)

శాంత :—అభివాదయే! (అని సేర్‌సింగునకు షేక్‌హేండు నీయబో వును) (ఆత డన్నవైపు చూచి) ఇదొక రకము సృష్టి.

శాంత :—అనాగరికుల కూటము – కరస్పర్శకు జంకే పురుషులు.

సేర్ :—సిగ్గు బిడియాలు లేని జాతి.

ఘోష్ :—డోంట్ మైండ్ హిమ్ దే ఆర్ హాఫ్ సివిలైజ్‌డ్.

రామ :—మీ రెవరు? ఈ కుఱ్ఱవా డెవడు?

ఘోష్ :—మేము వంగదేశస్థులము. ప్రపంచయాత్ర సాగిస్తూ మీ దేశానికి వచ్చాము. దారిలో ఈ కుఱ్ఱవాడు బండిక్రింద పడ్డాడు. గాయాలు తగిలాయి. ఇక్కడకు తెచ్చాము.

రామ :—ధన్యవాదాలు!

సేర్ :—మీ పే రేమిటి?

ఘోష్ :—నా పేరు మిష్టర్ ఘోష్. ఈమెపేరు మిష్టర్స్ ఘోష్.

సేర్ :—ఇద్దరికి ఒకటే పే రుండే! మీ రిద్దరు అన్న చెల్లెల్లా!

శాంత :—(నవ్వి) కాదు. ఈతడు నా ప్రాణప్రియుడు. భార్యాభర్తల కొకపేరుండటం నాగరికత, గాఢప్రేమకు లక్షణము.

జానకి :—పేర్లు మార్చుకపోతే ప్రేమ లేదన్నమాట. ఇదొక క్రొత్త సిద్ధాంతము. భగవంతుని సృష్టిలో ఎన్ని విచిత్రాలుంటాయి, ఎంత తెగించారు! కొంకు జంకు లేకుండా అర్ధ నగ్నశరీరాలతో వీధులలో విచ్చలవిడిగా సంచరిస్తున్నారు.

శాంత :—మోష్టు వల్గర్ అండ్ వెహిమెంటు ఇజ్ హెర్ స్పీచ్.

ఘోష్ :—వైటీ! ఉయ్ షల్ హేంగ్ దెమ్ ఆల్. ఈమెవ్వరూ?

సేర్ :—ఈమె మా వదిన. ఈయన మా అన్నగారు.

ఘోష్ :— హో ఐ సీ.

(దాసు ప్రవేశించి దణ్ణముపెట్టి) ఈ వింతజంతువులను ఎక్కడ కొన్నారండి? ఓస్! బలే షోకుగా నిలబడ్డాయే!

సేర్ :—గోన్లు కావురా మనుష్యులురా!

శాంత :—హూ ఈజ్ దిస్ బ్రూట్! మోస్టు అన్‌సివిలైజ్‌డ్ రాస్కెల్.

ఘోష్ :—ఐ థింక్ డైయిర్ సర్వెంట్.

దాస్ :—అదేమిటి బాబూ! అయితే మీ ఉద్దేశము నాకు బుఱ్ఱ లేదనే! మనుష్యులైతే మెడలో ఆ తాడెందుకు? ఆ కళ్ళకు గంత లెందుకు? •

ఘోష్ :—నీ వెవరవు? హద్దు మీరి మాట్లాడుచున్నావు.

దాస్ :—(ఉలిక్కిపడి) మనుష్యులే! పగటివేషాలు కావుగదా! (నెక్‌టై పట్టుకొని) ఈ తాడెందుకు బాబూ?

సేర్ :—(నవ్వుతూ) తప్పురా, దూరముగా ఉండు!

శాంత :—స్మాష్ హిం టు పసెస్ ఎట్‌వన్సు. రోగ్.

ఘోష్ :—వెయిటీ, వుయి ఆర్ స్ట్రేంజర్సు. లెట్ అజ్ బేటిల్ హియర్ అండ్ దెన్. వుయి షెల్ హింగ్ ఆల్ దీజ్ కర్స్

దాస్ :—నేను చెప్పలేదండీ, ఇదొక రకము జంతువులని చూడండి, ఎల్లాగ బుసకొట్టుతున్నారో!

రాము :—ఓరేయ్ దాసు ! వెళ్ళి వైద్యుణ్ణి పిలుచుకొనిరా !

దాసు :—ఎందుకండి బాబూ ! వీళ్ళకు వైద్యము చేయిస్తారా ?

జానకి :—లేదురా పాపము ! కళ్ళువానికి దెబ్బతగిలిందిరా !

దాసు :—అమ్మగారూ ! ఈమాత్రానికే వైద్యు లెందుకండి ? ఏ గచ్చాకో, పుచ్చాకో వేస్తే మానేదాని కింత హడావిడి యెందుకు ? మీరు 'ఊ' అంటే ఇరుకుమంత్రము వేసి రోగము దెబ్బ తగ్గిస్తా.

ఘోష్ :—అల్లాగ కాదు, మంచి వైద్యము చేయించవలెను

సేర్ :—ఓరేయ్ మాటకు మాట అందివ్వక వెళ్ళి వైద్యుణ్ణి పిలుచు కొనిరా !

ఘోష్ :—వినయ విధేయతలు లేని సేవకులు అక్షంతవ్యులు.

రాము :—మీరు తిరిగి వచ్చిన దేశాలలో వైద్యు లుంటారా ?

ఘోష్ :—బ్రహ్మాండమైన భవనాలు. నిరంతరము గాలి వీచే విశాల భవనాలు. పరిచర్యలుచేసే నర్సులు. అనుభవముకల వైద్యులు శాస్త్రోక్తముగా యంత్రములతో తయారుచేసిన మందులు— ఆ దేశములతో పోల్చినప్పుడు మనము పశుప్రాయుల మనియే చెప్పవచ్చును.

శాంత :— అక్కడ ఉన్న యంత్రశాలలను, మందులను తయారు చేసే ఫాక్టరీలను, పనిముట్లను • సృష్టించే కర్మాగారాలను చూస్తుంటే జన్మ తరిస్తుంది.

రాము :—మీకు వైద్యము రాదా ?

శాంత :—రా కేమి ?

(ఇంతలో వైద్యుడు వచ్చి తులసీతీర్థము త్రాగుట కిచ్చి)

ఆపదామ పహర్తారం.........వైద్యో నారాయణో హరిః

(అని త్రాగించును)

దాసు :—శాస్త్రుల్లుగారూ ! ఆంజనేయదండకము చదువుతే యెందు కైనా మంచిదేమో! ఒక్కొక్కసారి రాక్షసులు మనుష్యులకు పూనినప్పు డిటువంటి దెబ్బలు తగులుతాయని మా అమ్మమ్మ నా చిన్నతనములో చెప్పింది ఉండండి.

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాతది... ...

సేన్ :—ఉండరా దాసు ! ఏమిటి ఈ హడావిడి ?

ఘోష్ :—'స్టిమ్యులెంట్సు' ఇస్తే బాగుంటుందేమో !

శాంత :—'ఎక్స్-రే ఫోటో' తీస్తే బాగుంటుందేమో !

ఘోష్:—డాక్టరుగారూ ! మీ దగ్గఱ ఎక్స్-రే ఫోటో తీయుటానికి పరికరాలున్నాయా ?

వైద్యుడు :—అంటే ?

ఘోష్ :—(నవ్వి) పోనీ, కొటనిక్ శిరమ్ ఇవ్వండి.

రామ : —శాస్త్రిగారూ ! వారు చెప్పే మాటలు మీ కర్థ మవుతున్నాయా ?

జానకి :—శాస్త్రిగారూ ! మీ వైద్యము మీరు కానియ్యండి, తర్వాత చూద్దాము.

(వైద్యుడు కట్లువిప్పుటకు ప్రయత్నించి విఫలమనోరథు డగును)

(శాంత కట్లు విప్పును అందరు ఆశ్చర్యమొందెదరు)

(వైద్యుడు పట్టు వేసి వెళ్ళిపోవును)

రామ :—ఓరేయ్ దాసూ ! అల్లాగ తెల్లపోయి చూస్తున్నావేమిరా !

దాసు : —(దణ్ణముపెట్టి) ఇంత గొప్పవా ళ్ళనుకోలేదండి. మన శాస్త్రుల్లుగారు ఉట్టి చవ కైపోయాడు. క్షమించండి బాబూ! తెలియక కూశాను. నేను పుట్టినప్పటినుంచి ఇంత గొప్పవైద్యులను చూడలేదండి.

(అని ఘోష్ ముందు సాష్టాంగ నమస్కారము చేయును)

రామ :—ఓరేయ్ వాళ్ళకు మన తోటలో విడిది యేర్పాటుచెయ్య.
ఈ కుజ్జవాన్ని మన ఆస్థాన వైద్యు నింటికి పంపు.

(శాంత, ఘోషులు వెంట వెడలుదురు)

(రామసింగు వారిరువురకు నమస్కరించును. సేర్ సింగు షేక్ హాండిచ్చును)

జానకి :—వీ ళ్ళెంత చప్పున వెళ్ళిపోతే దేశానికంత మంచిది. సేర్ సింగ్! రెండ రోజులలో వీళ్ళను పంపేమార్గము చూడు. లేక పోతే అమాయకులైన ప్రజలు పాడై పోతారు.

సేర్ :—క్షమించాలి. వీళ్ళ సహవాసమువలన మన దేశములో నాగరకత వ్యాపించి ప్రజలు బాగుపడుతా రని నా నమ్మకము.

అనుమాన మిసుమంత నరయని చిత్తముల్
కరుణార్ద్రరాజితాక్షములజంట
సంఘంబు సేవింప జంకక తోట్రిల్లు
పదములు శాస్త్రిల పరిచయంబు
సుధ జల్లు కంఠముల్ సూరివందిత శబ్ద
శోభితవాక్యముల్ శోభ దనర
పరమాత్మ వీక్షించి ప్రకృతినే సేవించి
ముదమొందు సద్గుణ పుంజ మొప్ప
ధన్యులగు వీరి మనదీట దన్రునాడు
భోగభాగ్యాల దులతూగి మునుపుకన్న
నున్నతిని బొందు మనజాతి యుద్భవిల్ల
పార్థసారథి లెల్లడ ప్రతిభగాంచ.

రామ :—వాళ్ళ పద్ధతులు మన కవసరము లేకపోయినా వాళ్ళ విజ్ఞానము మన కవసర మనుకొంటాను.

జాతి పెంపొంద వలయు లక్షణము లెన్నొ
కలవు వానిని సాధించి మెలగు నెడల

జాతిధర్మంబులును నిల్పు! జాతి వృద్ధి
జెందు పూర్వపుటౌన్నత్య మొందుచుండ.

జానకి :- వాళ్లోకక్షణమైనా ఇక్కడ ఉండటము మంచిది కాదని నా అభిమతము. వాళ్ళ మణులు తలను దాల్చిన కాలసర్పాలు.

బాహ్యసౌందర్యమును జూచి పడును పుర్వు
సాలెపురుగున కెంతో యుత్సాహ మొదవ
సాలెగూడుగున దాని రక్షణము సేయ
బ్రహ్మకైన నశక్యంబు! వలదు మనకు.

రామ :- సేర్ సింగు. మీ వదిన హృదయములో అసూయ ప్రజ్వరిల్లింది.

జానకి :- నేను భావిని ప్రత్యక్షముగా చూచి, రాబోయే పతనాన్ని వారించటానికి ప్రయత్నిస్తున్నాను. పూజ్యపాదులు గాంధీగారి వాక్యాలు నా చెవులలో గింగురుమంటున్నాయి. ఈ స్త్రీయే అన్నదమ్ములను విడదీసే భయంకర శక్తిస్వరూపిణి అని యభిప్రాయము.

భేదబుద్ధిని కల్పించి విరియజేసి
హృదయముల ద్వేషభావంబు నెంతో నిల్పి
మనుజులను మార్చి సర్వంబు మాయజేయు
వనిత యామెయె యని తోచు! పంపు డిపుడె.

రామ :- రాజకీయవిషయాలలో స్త్రీల కనుభవము తక్కువ.

జానకి :- కావచ్చును. కాని, హృదయాలను అర్థముచేసికొనటములో వాళ్ళకుకూడ సమర్థతఉంది. నాకు తొందరపను లున్నాయి. పోతున్నాను. దీర్ఘముగా ఆలోచించి పనిచేస్తే పశ్చాత్తాప మొందవలసిన అవసర ముండదు. (అని వెడలిపోవును)

రామ :- మీ వదినకు కోపమువచ్చింది. సంస్కారాలంటే స్త్రీలకుగిట్టదు

సేర్ :- ఇప్పుడు నచ్చకపోయినా కొద్దిరోజులకైనా ఆమె మనస్సు మారక తప్పదు. మన దివాన్‌పని ఘోష్‌కిస్తే—

రామ :—తరతరాలనుండి వచ్చే దివానుగిరిను తొలగించటమే !

సేర్ :—వాళ్ళకుటుంబాన్ని పోషిద్దాము. కార్యభారముమాత్రము ఘోష్‌మీద పెట్టాము.

రామ :—సరే చూద్దాములే !

(దాసు ప్రవేశించి) ఎందుకండీ ; వెధవలము మేము. వాళ్ళిద్దరు చిలుక గోరింకల్లాగ నవ్వుతూ మాట్లాడుకొంటూ పోతుంటే ఓతిమీదికెక్కిన శవానికికూడా సంసారము చేయాలని— అటువంటి సంసారము చేయాలని బుద్ధి పుట్టింది.

రామ :—అయితే వాళ్ళపద్ధతి నీకు నచ్చిందన్నమాట.

దాసు :—రెండు నిముషాలలో సోమూను సర్దేశారండీ. ఆ ఆడమనిషి బంగారమంటె నమ్మండి. గదంతా ఒక నిముసములో అలంకరించారు. కనులపండువ. చూచి తీరాలి. భూలోక స్వర్గమే. అదేదో పాడుతూ ఆడిందండి. మన అమ్మగారు ఝానమ్మగారు అడుతారు, పోలిక ఎక్కడైనా ఉందా ?

సేర్ :—అయితే వాళ్ళదగ్గర బంట్రోతుగా ఉండరాదురా !

దాసు :—అంత అదృష్టమా అండి !

రామ :—మాట్లాడమంటావా ?

దాసు :—బాబుగారూ ! (ఆలోచించి) మీ పాదాలను వదలి నేను బ్రతుకగలనా ? జానకమ్మగారి ముఖము చూస్తే ఆకలి దప్పికలుండవు—ఆ ముఖములో—

సేర్ :—ఏడిశావులే ! పోయి నీ పని చూసుకో !

రామ :—మనము వెళ్ళి ఒకసారి పల్కరించి వస్తే.

సేర్ :—అది మర్యాద అనుకొంటాను.

దాసు :—దారి చూపించమంటారా ?

రామ :—(నవ్వుతూ) పోసిరా ! (వెడలుదురు)

# ఝాన్సీ లక్ష్మీబాయి?

దీవాన్ కోటరాత్రిగోడ

## అయిదవ దృశ్యము

ఝాన్సీ—పూజామందిరము.

(ఝాన్సీ పూజచేయుచు భారతమాతను స్తవమొనర్చును)

గేయం

వినుతింతునిన్ను ఓ మాతా విశ్వసన్నుతా
ప్రణుతింతునిన్ను భారతీయ శూరసమేతా!
కర్ణాదివీరులను బెంచిన కన్నతల్లి
బలిని ముద్దాడినట్టి భాగ్యశాలినీ!
సరిలేరు నీకు జగమందు వీరతయందు
తులలేదు నీకు వైభవమున తూగుటయందు!
యుగపురుషుల పెంచినట్టి గేస్తురాలవు
నిగమములను నేర్చినట్టి విజ్ఞురాలవు
సిరులను నినుబోలినట్టి దేశములేదు
శూరతతో నీకు సాటిలేనేలేదు
వినుతింతునిన్ను ఓమాతా విశ్వసన్నుతా
ప్రణుతింతునిన్ను భారతీయ శూరసమేతా!

విదేశీయరాగ మాలాపించుచు సేర్‌సింగు ప్రవేశించును.

ఝాన్సీ:— ఈవేళ ప్రభాతసేవకు రాలేదే! మీ అన్నదమ్ములు సంపూర్ణముగా మారిపోయారు.

సేర్ :—ఝూన్సీ! నిజమే. పూర్వము మన సాంప్రదాయాలమీద ఉన్న మమకారము, పట్టుదల తగ్గిపోయింది. వాళ్ళ పద్ధతులను ఆచారాలను చూస్తుంటే మన జీవితానికి నే నెంతో సిగ్గుపడు తున్నాను.

స్త్రీజాతి శంకించి చెఱబెట్టి యేడ్పించు
జాతి మా దని నేటి చర్చ దేలె
కడజాతి యని పిల్చి కరుణను పోనాడు
జాతి మా దని నేటి చర్చ దేలె
విగ్రహంబుల బూజ విశ్వేష నిందించు
జాతి మా దని నేటి చర్చ దేలె
పొట్టికూటికి నీచ పుస్తకాల్ విరచించు
జాతి మా దని నేటి చర్చ దేలె
సిగ్గు సిగ్గగు వారలచెంత నిల్వ
సర్వస్వము లని ప్రేమించు సరసులంచు
స్త్రీల పూజించి పోషించు ధీరులంచు
పేరుపొందిన దేవతల్ వారు నిజము.

ఝూన్సీ :—అందుకనే మా అక్కయ్య అన్నారు. కార్లమీద ప్రేమ తగ్గించమని.

సేర్ :—ఈవేళ టీపార్టీకి రమ్మన్నారు.

ఝూన్సీ :—వెళ్ళండి. త్రాడు తెగిన గాలిపట మెక్కడ చిక్కుకొం టుందో, ఎక్కడ పడిపోతుందో ఎవరికి తెలుసును ?

సేర్ :—అనుమానిస్తున్నావా ?

ఝూన్సీ :—అనుమానించటము లేదు కాని, మీ సాంప్రదాయాలను అర్థముచేసికోలేక పరుల సాంప్రదాయాలకు ప్రాకులాడటము చూచి యేడుస్తున్నాను, వాళ్ళ సాంప్రదాయాలను స్వీకరించ

టములో ఉన్న ఉబలాటము మీ సాంప్రదాయాలను వాళ్ళకు నేర్పటములో ఎందు కుండకూడదు? క్షత్రియవంశములో జన్మించి, ఆత్మగౌరవాన్ని చంపుకొని పరాయివాళ్ళ కొంపల చుట్టు తిరగటము నేను భరించలేకపోతున్నాను.

పూత భూభుజవంశాన బుట్టి సకల
శాస్త్రముల నేర్చి, పండిత స్తవము నొంది
విమల యశమున తనరారు విబుధయుగము
పరులకొంపల దిరుగ నెవ్వండు సైచు.

నేర్ :—వాళ్ళ విజ్ఞానాన్ని సంపాదించటానికి ఆ భాష నేర్చుకోవటానికి.

తొల్లి భూభుజవంశముల్ ద్రోసిలొగ్గి
భక్షుకునిభంగి గురుచెంత! విద్య నేర్చి
విమలయశమును బొందరె! విబుధవరులు
ఎక్కలకు పోయి చెడిపోవు! తిక్క జూపి.

ఝాన్సీ :—మీకు భాష లేదా? మీకు విజ్ఞానము లేదా? మీకు షట్ శాస్త్రాలు లేవా? మీ నృత్యశాస్త్రమే గంగలో కలసి పోయింది? పరుల సంగీత నృత్యశాస్త్రాలే మీకు కావలసి వచ్చాయా! కొంచె మాలోచించి చూస్తే మీ రెంత క్రిందకు దిగిపోతున్నారో అర్థమవుతుంది.

షట్ఛాస్త్రములు లేవె సాధించి గర్వింప
వాఙ్మయంబులు లేవె ప్రజ్ఞ జూప
నృత్యశాస్త్రము లేదె నిజశక్తి ప్రకటింప
గీర్వాణులకుగూడ! గెంటివేయ
సంగీతశాస్త్రంబు సాధింపలేదొకొ
పరవళ్ళ ద్రొక్కింప బ్రకృతి సతము.
మంత్రశాస్త్రము లేదె మననంబు కావించి
విబుధవర్గము దిప్ప వెంట నెపుడు

అక్షరంబుల నెఱుగని యధములటుల
పరులకొంపల దిరుగాది వారి పిచ్చి
వెఱ్ఱికూతల పద్ధతుల్ వెంటబడగ
సిగ్గు కాదొకో నావంటి శీలవతికి

సేర్ :—క్రొత్తభాష నేర్పాటమువలన వచ్చే నష్ట మేమిటి?

ఝూన్సీ :—నేను స్త్రీని. ఆ విషయము నేను చెప్పలేను. కాని, మన దేశము వచ్చినపుడు వాళ్ళు మనభాష నేర్చుకొని మనసాంప్రదాయాల ననుసరించి జీవించటము సహజము. వాళ్ళ భాష నేర్చుకొనటము వాళ్ళ ఛ్ఛాయలో సంచరించటము ప్రకృతికి విరుద్ధము. అదే బానిసత్వము.

సేర్ :—సరే! తెలియని విషయాలను చర్చించి లాభము లేదు. చర్చలు స్త్రీల కందని పూర్వసీమలు—నీవు ఈవేళ టీపార్టీక రావాలి.

ఝూన్సీ :—నేనా! భర్తను నీడవలె అనుసరించి సంచరించే మా అక్కయే "నేను టీపార్టీకి రా" నని ఖచ్చితముగా చెప్పినపుడు మీ పురుషులు కారణ మెందుకు తెలుసుకోలేరు? క్రొత్త గొడ్డలి దొరికిందనికదా ఆనందముతో గారాబముగా పెంచిన రసాలసాలాన్ని చేదిస్తున్నారు. తర్వాత పశ్చాత్తాపమొందినా దాన్ని బ్రతికించలేరు. పూర్వసౌందర్యాన్ని తేలేరు.

సేర్ :—వాళ్ళ పద్ధతుల ననుసరించటమువలన దేశములో ఎన్ని మార్పులు వచ్చాయో చూశావా?

ఝూన్సీ :—పాముకుండే మెరుపును, మెత్తతనాన్ని చూచి మురిసి పోతున్నారు కాని, దాని కోరలలో ఉండే విషాన్ని మరచి పోతున్నారు. ఆధ్యాత్మికపతన మెంత కల్గిందో గుర్తించారా! మీ అధఃపతనములో మీ రానందించక మా సాహచర్యాన్ని కోరుతున్నారా?

సేఠ్ :—స్వర్గమో, నరకమో భార్యా భర్త లొకలోకములో ఉండటమే మంచిదికదా!

ఝూన్సీ :—భర్తను నరకానికి పోనిచ్చే భార్య భార్యకాదు. అతనితో కూడా ఆనందముతో నరకానికి వస్తానని ఉబలాటమొందేది స్త్రీ కాదు — మీ టీపార్టీల హడావిడిలో శంకరజయంతిమాట మరచిపోయారు పూజ్యపాదులు గాలవులు వచ్చే వేళఅయింది.

సేఠ్ :—ధర్మాన్ని నాలుగుపాదాల నడిపించే గృహలక్ష్ములు మీరున్నారుకదా!

ఝూన్సీ :—గాలవులు త్రికాలవేదు లని ఇప్పు డర్థమైంది.
(దాసు వచ్చి ఝూన్సీని చూడకయే) బాబూ! అమ్మగారు రమ్మంటున్నారు.

ఝూన్సీ :—ఏ అమ్మగారురా?

దాసు :—(తనలో) చూడలేదే! కొంప మునిగింది! (ప్రకాశముగా) జానకమ్మగారండీ!

ఝూన్సీ :—అమ్మగారి గుణాలు పట్టుబడ్డాయన్నమాట. జానకమ్మగారెప్పుడైనా చిన్నబాబుగారికి కబురు పంపించారురా?

దాసు :—అదేమిమాటఅండి! ఎప్పుడు పంపించకపోతే, ఇప్పుడు పంపించకూడదదా?

ఝూన్సీ :—చూడండి; క్రొత్తనాగరకతవలన ఎంత బాగుపడ్డాడో! పూర్వము పాపము చేస్తే సగము చచ్చినట్లు సిగ్గుపడి తన తప్పు ఒప్పుకొని, పశ్చాత్తాపాన్ని చెందేవాడు. మొగమెత్తి మాట్లాడలేక బాధపడేవాడు. ఇప్పుడు ఏబాయించి దాన్ని సమర్థిస్తున్నాడు. అంతరాత్మను కావాలని చంపేస్తున్నాడు. ఇప్పుడైనా అర్థమైందా దేశానికి అన్నదమ్ములు చేసే మేలు?

దాసు :—అమ్మగారు దీనికే ఇంత హడావిడి చేస్తున్నారు. రేపు భారతమాతచేతిలో జెండా, కత్తిని తీసివేసినపుడు ఎంత గందరగోళము చేస్తారో!

ఝూన్సీ :—ఎవరురా ఆ మార్పు చేసేది ? వీలులేదని చెప్పు. ఆ విగ్రహముజోలికి వెళ్ళిన వాళ్ళ తల యెగురుతుం దని, జమీందారులు దగ్గఱకు చేరినంతమాత్రాన కుక్క సింహము కా దని చెప్పు.

సేర్ :—ఝూన్సీ. అది రాజకీయానికి సంబంధించింది. నీవు జోక్యము కలుగజేసుకోకూడదు.

ఝూన్సీ :—కాదు, అది ఈ దేశములో ఉండే స్త్రీ పురుషహృదయాలలో గాఢముగా నాటుకొన్న దేశాభిమానిము రాశీభూతమై నప్పు డేర్పడిన చిహ్నము. దాన్ని సంస్కరించటానికి ఏ వ్యక్తికి ఏ సంఘానికి, ఏ ప్రభువులకు అధికారము లేదని మనవిచేస్తున్నాను. ఆ మార్పును నే నంగీకరించను. అంగీకరింపజాలను.

సేర్ :—ఝూన్సీ! నా మాటకు అడ్డుచెప్పటమే వ్రతముగా పెట్టుకొన్నావు. ప్రతిక్షణము నీ అవిధేయతతో నన్ను పరాభవిస్తున్నావు. నేను క్షత్రియవంశసంజాతుణ్ణి. నా పేరు సేర్ సింగు.

ఝూన్సీ :—నా కుండే దేశాభిమానాన్ని వెలిబుచ్చాను కాని, పతిభక్తిని విస్మరించటము లేదు. దేశభక్తిలో పాతివ్రత్యాన్ని ప్రతిభవింపజేస్తున్నాను కాని, బలియివ్వటము లేదు. ప్రభువులు దయయుంచి న న్నర్థముచేసుకోవాలి.

సేర్ :—దాస్ ! నడు. (ఝూన్సీని చూడకనే) గాలవులు వస్తే మా అన్నయ్య పూజచేస్తా రని నాకొఱకు నిరీక్షించ వద్దని చెప్పు.

(అని వెడలిపోవును)

ఝూన్సీ :—అన్నదమ్ములు సంపూర్ణముగా మారిపోయారు. అర్థముకాని అన్యసాంప్రదాయాలమీాది మోజుకొలది, జీర్ణించి రక్తమాంసాలలో మిళితమైన ఆర్య సాంప్రదాయాలను పరిత్యజిస్తున్నారు. భోగభాగ్యాలవెంట పరువులెత్తే జాతి స్వాతంత్ర్యాన్ని రక్షించుకోలేదని గాలవులు చెప్పినమాట నిజమే.

(గాలవుడు రామనామస్మరణము చేయుచు వచ్చును.)

చూడవా శ్రీధరున్ సేవచేతురా
భువనభర్తన్ పతితసేవన్
భోగము లొసగెడు మోక్షంబిచ్చు
ప్రభువున్ చూడర కనరా ముక్తి
పతితుల కొలచుట శర్వునిసేవ.

(ఝాన్సీ నమస్కరించును)

గాల :—సౌభాగ్యవతీభవ ! సేర్‌సింగు ఏడి ? ఈవేళ శంకరజయంతి.

(ఝాన్సీ మౌనము వహించును)

గాల :— ఈవేళ సేర్‌సింగు పూజచేస్తాడు. తనకు పని ఉందని చెప్పి నన్నిక్కడకు పంపించాడు.

ఝాన్సీ :—అన్నగారు పూజచేస్తారని తమ్ముడు వెళ్ళారు.

గాల :— నారాయణ !

ఝాన్సీ :—మేము పూజించే భారతమాతను మార్చేస్తారట. కత్తి, జెండా, భారతమాతకు శోభించవట.

గాల :—అవును. క్షత్రియులు మీసాలు, గడ్డాలు తీయించే దినాలలో కత్తికి, జెండాకు అవసరము లేదు. రూపము సంపూర్ణముగా మారిపోయింది. బ్రాందిబుడ్డి సిగరెట్టు పెట్టె ఆమెచేతికి వస్తాయి.

(జానకి ప్రవేశించి గాలవునకు నమస్కరించును)

జానకి :—శంకరజయంతి మా మరది ఇంట్లో జరుగుతుందని చెప్పి నన్ను వెళ్ళమన్నారు.

ఝాన్సీ :—పూజాద్రవ్యాలేవి ?

జానకి :— మా మరది ఝాన్సీని మా ఇంటికి పంపుతాడని నాకు తెలుసును. అన్నదమ్ముల రాజనీతి అంతఃపురాలలో పనికి వస్తోంది.

ఝాన్సీ :—పాడి పంటలతో కలకలలాడే భారతభూమి ఫాక్టరీ పొగలతో మలినమైపోయింది కమ్మని రాట్నపు ధ్వనులు పోయి పేదల రక్త మాంసాలతో క్రొవ్వెక్కి కాకు లరిచే యంత్రాగారాల భైరవ వాట్టహాసాల ప్రవేశించాయి. సహజసౌందర్యము నశించి సౌందర్యపిపాస క్షీణించి వికృతి, కృత్రిమాకారాలను విచిత్రగతుల పూజించే జాడ్యము ప్రజలలో వ్యాపించింది. మృదు మధుర కోమల రవ సూక్ష్మతమ విభేదాలను మరచి నక్కకూతలకు నక్కకూతలకు వెంటపడుతున్నారు.

గాల :—ఝాన్సీ! మహావేగముతో పొంగి పొరలివచ్చే మహానది నిరుపేదల కొంపలను కొట్టటం సహజమే. పేదరైతుల బాధలను చూస్తే వాళ్ళ ఆర్తనాదాలను వింటే జాలిగల హృదయము చెక్కలైపోతుంది.

జానకి :—అది శ్రీజగద్గురు శంకరాచార్యుల ద్వంద్వాతీతస్థితికి విరుద్ధము.

విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.

గాలవుడు పూజ చేయించును.

బౌద్ధ వాఙ్మయ కాంతార పావకం చంద్రశేఖరం
అద్వైతామృత దాతారం శంకరం సతతం భజే.
శోధితాఖిలశాస్త్రం విజ్ఞానజలధిం గురు
జగద్గురుం సదా వందే మోక్షదం భక్తవత్సలం.

గాల :—భారతస్త్రీలలో దైవభక్తి నశించనంతవఱకు భారతభూమికి భయములేదు. అమ్మా వస్తా! (అని వెడలిపోవును)

(జానకి, ఝాన్సీ జగద్గురు శంకరాచార్యుని తదేక దృష్టితో జూచెదరు)

రైతులు తమ కష్టముల దెల్పు కీర్తన బాడుచు వెడలుదురు, జానకి, ఝాన్సీలు అశ్రుపూరితనేత్రలై నిలువబడెదరు.

## గేయం

వినండి! - రైతులబాధలీలా!
జగతిలో - దుర్భరమా!
స్వార్థమయంబౌ జగతిలోపల
సుఖము అరుదాయె! వినండి!

రైతుకష్టమే జగతికి భిక్ష
రైతులేనిదే జగమే లేదు!
హాలమె సుఖసంధాత నేత!
హాలమె విశ్వవిఖ్యాతపూత!

హాలపూజనమే వాంఛనీయము
హాలము శుభదాయి!
వినండి - రైతులబాధలీలా
జగతిలో దుర్భరమా!

(తెర పడును)

# దీపావళీ రాత్రిగీత

## ఆరవదృశ్యము

ఘోష్, శాంత, సేర్‌సింగు, రెండు టేబిల్ మీద సారా
సీసాగ్లాసు, సిగరెట్లడబ్బా—గ్రామఫోన్ పాట)
శాంత రాగమాలాపిస్తూ వచ్చి సేర్‌సింగుకు సారాగ్లాసు
అందిచ్చును. ప్రేమదృష్టులతో జూచుచు తాను త్రాగును.

సేర్ :— ఒకసారి మీ నృత్యము చూడాలని ఉంది.

శాంత :—ఒకసారి చూస్తే లాభ మేమిటి? నృత్యము నేర్చుకోవాలి.

సేర్ :—మీరు మా భాష స్వేచ్ఛగా మాట్లాడేస్తున్నారే!

శాంత :—మీ అన్నదమ్ములు మా భాష నేర్చుకోలేదా!

ఘోష్ :—నాల్గుసార్లు నీ నృత్యము చూస్తే దాన్ని అనుకరిస్తాను.

శాంత :—నా కా భయము లేదు. ఇది వాళ్ళ నృత్యము కాదు. చూడగానే పట్టుకోవటానికి. (అని నృత్యము చేయును)

గేయం

ప్రేమాంకితమే జీవితమూ
ప్రేమమయంబే జగమూ!

యీజగమందు
పావనమైనది
ప్రేమంబొకటే
కాదా!

ప్రేమాంకితమే జీవితమూ
ప్రేమమయంబే జగమూ!
అనురాగంబే
ఆశయమైతే
ప్రేమపూజ స్థిర
మౌరా!

ప్రేమాంకితమే జీవితమూ
ప్రేమమయంబే జగమూ!

(సేర్‌సింగు మెచ్చుకొని షేక్‌హాండిచ్చును)

(శాంత వచ్చి సేర్‌సింగుప్రక్క కుర్చీలో కూర్చొని సిగరెట్టు వెలిగించి అతని కందిచ్చి తాను కాల్చుచు) మిష్టర్ సింగ్. మీ ఆచారాలలో నా కొక్కటి నచ్చలేదు. అందులో నా హృదయాన్ని దహించే పెద్దవాడే రాజ్యాధికారి అనే పిచ్చి సిద్ధాంతము. చిన్నవాడెంత సమర్థుడైనా వాడిబుఱ్ఱను మట్టి అంటారు. ఈ గ్రుడ్డిసిద్ధాంతమువలన ఎంతమంది మేధావులు నామరూపాలు లేకుండా కాలగర్భములో లీనమవుతున్నారో!

ఘోష్:—భారతీయులలో ఉండే మౌఢ్య మిదే! (కాల్చుచున్న సిగరెట్టుపొగలో స్వప్నదృశ్యాలను చూస్తూ)

సేర్:—పూర్వకాలములో ఈ సిద్ధాంతాలకు విలువ ఉండవచ్చును. కాని, ఈ రోజులలో మృతిపొందిన మూలసిద్ధాంతాలని చెప్పవలసి ఉంటుంది.

శాంత:—తప్పని తెలిసిఉండీ దాన్ని శిరసా వహించటము మౌఢ్యము కాదా!

పాప పుణ్యంబులను దేల్చు ప్రజ్ఞలేక
మూఢమర్త్యులు గావింప! బుద్ధిలేమి

పాపముల నైపవచ్చునా ! సంశేతుంకా
యెఱిగి కావింప నెటుల సైరింపవచ్చు.

ఘోష్ :—భారతీయులు సాహసించి ముం దడుగు వేయలేరు.
కర్మసిద్ధాంత మొకవంక, కరుణ యొకట,
గర్భదారిద్ర్య మొకవంక కలహ మొకట
క్షుద్ర నీచ కుటిల భేద కోటి యొకట
కల్గ ముందుకు బోవగ గదల డడుగు.

శాంత : మీ అన్నగారితో విడిపోయిందాకా నీవు బాగుపడ లేవు, అవిభ క్తకుటుంబవ్యవహారము లలో చిక్కుకొని యెంతమంది తమజీవితాలను ఆహుతిచేసికొన్నారో !

సేర్ :—మా అన్నగారు నా కే విషయములోను లోపము చేయ లేదు. ఆయన ధర్మస్వరూపుడు. ప్రేమావతారము.

శాంత : —పైకి అల్లాగే ఉంటారు చాపక్రింద నీరులాగ. దిగుతే కాని లోతు తెలియదు. మిష్టర్ సేర్ ! నీ యభివృద్ధి కోరేదాన్ని కనుక చెప్పుతున్నాను. ఈవిధముగా తృప్తిపడటానికే మానసిక దాస్య మంటారు. నిన్ను గాఢముగా ప్రేమించటమువలన నీ అధః పతనానికి విచారిస్తున్నాను.

ఘోష్ :—మీ అన్నగారు చౌకవిఖ్యాతికి బాధపడుతూ నీ కొంప ముంచేస్తున్నారు. దాన్ని నీవు గమనించటము లేదు. నేను వెనుకటి లెక్కలు తనిఖీచేశాను. అందులో దేవాలయాలకు, అతిథి సంతర్పణలకు, తటాక నిర్మాణానికి, ఖర్చు పెట్టిన సొమ్ము తలచుకొంటే గుండెలు బ్రద్దలౌతాయి.

శాంత :—ఇంత అన్యాయము జరుగుతున్నా మీ అన్నగారిని సామాన్యప్రజలు శ్రీరామచంద్రమూర్తి అని అవతారమూర్తి అని పిలిచి ఆతని రాజ్యాన్ని రామరాజ్య మంటున్నారు. ఈ దేశములో ప్రజలకు ప్రభువుల వ్యవహారాలతో ఆసక్తిఉండదు.

ఘోష్ :— సేర్ సింగుస్సైరైనా ఆ దానపత్రికలలోగాని. ఆ శిలాశాసనాలలోగాని లేదు. అతని కభిమాన విద్యయైన సంగీతానికి గానా, నృత్యానికి గాని, దమ్మిడీయైనా ఖర్చుపెట్టాడా! ఒక పాఠశాలనైనా స్థాపించాడా!

సేర్ :—(అన్యథాయత్తచిత్తుడై) అది ఆలోచింపవలసిన విషయమే. కాని, భారతీయుల కాధ్యాత్మికచింత హెచ్చు.

శాంత :—ఆధ్యాత్మికచింత ఉన్నవాళ్ళకు ఈ రాజ్యా లెందుకు? అగ్రతకల తమ్ముల కప్పగించి అరణ్యాలకు పోకూడదు.

ఘోష్ :—న్యాయ మాలోచిస్తే పరిపాలకులకు కావలసిన లక్షణాలు నీలో ఎక్కువున్నాయి. కాని, సద్గుణా లెవరికి కావాలి. అగ్ర జన్మ మొకటే రాజ్యాధికారానికి ప్రథమ లక్షణము.

శాం :—మిస్ట్రెస్ సేర్‌లో ఉన్న గాంభీర్యము మార్దవము, విశాల హృదయము మిస్ట్రెస్ రామ్‌లో లేవు. కాని, యేమి లాభము?

సేర్ :—మా అన్నయ్య రాజ్యములో అందరు సౌఖ్యమొందుతున్నారు. ఇంతకంటె కావలసిన దేముంది?

శాంత :—(నవ్వి)నీవు పొందుతున్న సౌఖ్యమే వాళ్ళు పొందుతున్నారనుకొంటాను. సౌఖ్య మేదో, దుఃఖ మేదో తెలుసుకొనే శక్తి కూడా మీ ప్రజలలో మృగ్యము. మతముపేరు చెప్పి—మతమనే నల్లమందుమాత్రను వేస్తే ఆ మైకములో ఎవరికైనా జోహార్లు చెల్లిస్తారు.

ఏమి శాశ్వత మని చెప్పి యెఱుగనట్టి
యాత్మ వర్ణించి పరలోక మమకు నంచు
చెప్ప నెవరైన వెంటనే చేయు తత్వ
మున్న జాతి యెన్నటికిని బొందు వృద్ధు.

సేర్ :—ఈ విషయము చర్చించటానికి కొంతకాలము కావాలి. (కాలుతున్న సిగరెట్టును కాలితో నలిపి ఇంకొకగ్లాస్ త్రాగి)

నా స్వాతంత్ర్యాన్ని నేను పోగొట్టుకోలేనని, నా సాంప్రదాయాలను, నా అభిప్రాయాలను (మతమును) రక్షించుకోనటము నాకు ముఖ్య మని మీకు వాగ్దానము చేస్తున్నాను.

ఘోష్ :—హామ్లెట్టను రాజు లభించిన అవకాశాలను జారవిడిచి చివరకు ఆత్మహత్యచేసికొన్నాడు. పరిస్థితులు మనకొఱకుఆగవు పరుగెత్తుకొని పోతుంటాయి. వాటిని వెంటాడి ఉపయోగించుకొనటములోనే మానవుని గొప్ప ఉంది.

షేర్ :—స్వల్పకాలములోనే పోయిన స్వాతంత్ర్యాన్ని స్థాపించుకొంటానని వాగ్దానము చేస్తున్నాను.

(దాసు వచ్చి) బాబుగారు వస్తున్నారు.

(రామసింగు ప్రవేశించును, అందరు నమస్కరించెదరు)

(శాంత ఆతనికి పండ్లరసమిచ్చాను. షేర్‌సింగు అన్నగారిని చూడనట్లు వెడలిపోవును)

రామ :—(పండ్లరసము త్రాగుతూ) ఏమి అల్లాగ ఉన్నాడే?

ఘోష్ :—ఆరోగ్యము సరిగ లేదట—మొన్న దేవాలయపు భూములను గూర్చి మీ అభిప్రాయము వ్రాయలేదు.

రామ :—మిష్టర్ ఘోష్! మా సాంప్రదాయాలు మీ కర్థముకావు దేవాలయపు భూములమీద మన కధికారము లేదు.

శాంత :—ఆ నిరంకుశాధికారమే దేవాలయాలలో చెప్పరాని పాపాలను చేయిస్తోంది, పాశ్చాత్య దేశాలలో ఇటువంటి పరిస్థితులు వచ్చినప్పుడు దేవాలయాలని సంపూర్ణముగా నిర్మూలించారు.

రామ:— ఆ పాపాలను వారించవచ్చును కాని, సంస్థలనే నిర్మూలించటము అర్థములేనిది. దోమ లున్నాయని కొంపలు తగలబెట్టటము మూఢ్యముకాదా!

ఘోష్ :—మానవ నిర్మిత విగ్రహాలను పూజిస్తూ భగవంతుని నిందించటము మీవంటి నరపాలురు సహించకూడదు.

రామ :—భగవంతుని తత్త్వము మావంటి సామాన్యుల కర్థము కాదు. అర్థమైందని అనుభవమువలన చెప్పే పండితులమార్గాన్ననుసరించి పోవటమే మన కర్తవ్యము.

శాంత :—మీ దేశ మన్నివిధాల వెనుక పడింది. చాలమార్పులు చేయాలి.

రామ : సంస్కరించటము నాకు సమ్మతమే కాని, కరగించి పోత పోసి వేరొకరూప మివ్వటము నే నంగీకరించను. విప్లవము మా దేశములో జీవించలేదు. వికాసము వృద్ధిపొందుతుంది. స్త్రీ పురుష స్వైరవిహారాన్ని హిందూదేశము భరించలేదు.

ఘోష్ :—స్త్రీలకు మీ దేశములో స్వాతంత్ర్యమే లేదు. స్త్రీ గౌరవ మంటె మీ ప్రజల కర్థము లేదని మా ప్రజల నమ్మకము.

రామ :— మీరు స్త్రీలసౌందర్యాన్ని, యౌవనాన్ని, ఆభరణాలను, అలంకారాలను, వస్త్రాలను ఆరాధిస్తారు. మేము స్త్రీల సద్గుణాలను పూజిస్తాము. మీరు వార్థక్యాన్ని నిర్దాక్షిణ్యముతో అవమానిస్తారు. మేము మాతృస్థానమిచ్చి ఆరాధిస్తాము. పాప పుణ్యాచర్య లేకుండా మీరు స్త్రీలను, పురుషులతో సమముగా శాసిస్తారు. మేము పవిత్రహృదయులైన స్త్రీలకు. పవిత్రహృదయులైన పురుషులకంటె యెక్కువగౌరస్థాన మిస్తాము. అపవిత్రస్త్రీలకు, అపవిత్రపురుషులకంటె తక్కువస్థాన మిస్తాము. ఆ భేదాలను మీరు గమనించలేక స్త్రీలను గౌరవించటము మాకు తెలియ దంటారు.

ఘోష్ :— మిస్టర్. రామునిగాని, మిస్టర్. సేదునిగాని చూస్తే నా కెంతో జాలివేస్తుంది. వాళ్ళకు భగవంతు డిచ్చినశక్తులు లయమైపోతున్నా యని నా విచారము.

రామ :— శక్తులు లయముకావు. ఇంకొకరూపాన్ని పొందుతాయి.

మంచు కరగిన నీరుగా మారు, నదియు
యావిరై మేఘరూపాన సంబరంలో
నాక్రమించును, గాలిచే నదియు మరల
వర్షమై నేల ముంచును! ప్రకృతి యదిగొ.

శాంత :— సేర్ సింగు పడుతున్న బాధను మీ రర్థముచేసికొంటే మీరీ విధముగా పల్కరు

రామ :— సేర్ సింగు బాధపడుతున్నాడా!

ఘోష్ :— మీ కా గొడవే తెలియదా!

శాంత :— అన్నగారే తమ్ముని బాధను అర్థముచేసుకుంటే అతని కంతబాధ అవసరమే లేదుకదా!

రామ :— మీకు తెలుసునా!

శాంత :— తెలిసి ఉంటేమాత్రము లాభ మేమిటి?

రామ :— సాధ్యమైతే తొలగిద్దాము.

ఘోష్ :— లాభము లేదు. అందరానిపండ్లు.

రామ :— కారణము?

శాంత :— ఒకటి అన్నగారి కపకారము చేసేది. రెండవది సంఘాన్ని తారుమారు చేసేది.

రామ :— ఇంకకొంచెము విపులముగా చెప్పాలి.

శాంత :— తన వాంఛలన్నీ నెరవేరటానికి, రాజ్యము తనచేతులలో ఉండాలని, తన ఆశలన్నీ ఫలించటానికి, తన భార్యలో సంపూర్ణపరివర్తనము రావాలని బాధపడుతున్నాడు.

ఆధునిక నూత్నమార్గాల సతిని మార్చి
దేశమును స్వేచ్ఛ చాలించి దిశల బ్రాకు
కీర్తి తనరార వాంఛించు శిన్నడగును
సాధ్యములుకాని యత్నాల చలము పూని.

రాము :—(ఆలోచించుచుండును)

శాంత :—అవి అసాధ్యాలు. అనవసరముగా ఎందుకు బాధపడుతా వని మందలించాను.

ఘోష్ :—దేశాభివృద్ధికే—చౌకంతప్పు చేసుకుగాక—దేశాభివృద్ధికే అన్నగారు పాటుపడితే నే నెంతో సంతోషించివుండేవా నని అన్నాడు.

రాము :—అయితే నా భోగ భాగ్యాలకొరకు ప్రజలను పీడిస్తున్నానని బాధపడుతున్నాడా !

శాంత :—అక్కడ ఆగితే మొరుగే! ఈ ఉత్తరము చదువుతే మీకు సంపూర్ణముగా అర్థమవుతుంది.

ఘోష్ :—నీవే చదువు

శాంత :—(చదువును)

ఘోష్ దంపతులకు ఆకాశి రామన్న ఆశీర్వదించి వ్రాయునది.

దాసు దేవాంతకుడు. సేర్ సింగు పచ్చి నెత్తురు త్రాగే పశువు. ఘూర్ఖ్ జాతులనక్క. రామసింగు పూర్వకాలపు మనిషి జానకి అమాయకురాలు. ఎప్పటికైనా సేర్ సింగు వాళ్ళకొంప ముంచుతాడు. రామసింగు ఉప్పు మీరు తింటున్నారు. కనుక, ఎట్టి పరిస్థితులలోనైనా వారిని రక్షించవలసిన బాధ్యత మీ మీద ఉంది. సేర్ సింగును జాగ్రత్తగ కనిపెట్టి చూడండి. అవసరమైనప్పుడు ఉత్తరాలద్వారా కలుసుకొంటాను.

ఇట్లు

పరిచితుడు.

రాము :—(తల పట్టుకొని) శాంతా !

శాంత :—భయములేదు. మా ప్రాణాలొడ్డియైనా వాళ్ళను రక్షిస్తాను

రాము :—నా నీడలాగ సంచరించే తమ్ముడే నా ప్రాణాలు తీయడానికి కత్తులు నూరుతున్నాడు. నా ధర్మపరాయణత్వాన్ని అర్థము చేసికోలేకపోతున్నాను.

శాంత :—మే మెంతో నచ్చ చెప్పాము. అన్నగా రనుభవముకలవారు వారి పాదాలలో నడచి వెళ్ళటములోనే యభయముం దని చెప్పాము.

ఘోష్ :— మీరు వెయ్యి చెప్పండి, నూరు చెప్పండి, మా అన్న గారిలో విశ్వాసము లేదన్నాడు.

రామ :—నా ప్రేమను అర్థముచేసికో లేదా !

శాంత ;—కొత్తరాజు. ప్రజలందరు నీ పక్షము కనుక తన కెప్పుడైనా నున్నచుట్టా నని భయపడుతున్నాడు.

రామ :—నా మెదడు తిరిగిపోతోంది. కొంత విశ్రాంతి కావాలి.

ఘోష్ :—నే నొకరస మిస్తాను. అది తాగి విశ్రమించండి.

రామ :—(బుఱ్ఱ ఊపును.)

(శాంత సోడాలో సారాయి కలిపి ఇచ్చును)

రామ :—వాసన దుర్భరముగా ఉంది.

ఘోష్ :—మా మందు లన్నీ అంతే. మొదట చేదుగ నచ్చినట్లుంటుంది.

శాంత :—కాని. యింతమేలు యే మందు చేయలేదే.

హృదయమును గాల్చు దుఃఖాల నెఱుగకుండ
మెదడు హరియించి సుఖసృష్టి నొదవజేసి
మానవుని స్వర్గపాతాళ, మర్త్యలోక
ములను త్రిప్పును దానికి కలదె సాటి.

రామ :—(తాగి లేచి తూలుతూ) ప్రపంచమే తిరిగిపోతోంది అన్న దమ్ములు డీడిక్కీలు కొట్టుకొంటున్నారు. సోదరరక్తములో తడసి భూదేవి క్షోభిస్తోంది. ఆవిరైన రక్తపుగాలికి పంటలు మాడపోతున్నాయి. నవరత్నరాసులు మట్టైపోతున్నాయి.

గేయం

లేరా ! లేరా ! నిదురమానర
సోదర భాదతపీరా !

సంఘమర్యాద సమసిపోవగా
చాలు నీ నిదుర లేరా!
చాలుచాలు నీ సంఘోన్నతికై
సాధనచేయగ లేరా!
ద్రోహబుద్ధులు దోపిడీలకు
దూరముగా నిలబడరా!
భారతజననిని దీవెన వేడూ
ధర్మదేవతను చూడూ!
• దీక్షగానున్న నిన్ను గెల్వగా
ధీరులులేరీ జగతినీ!
లేరా! లేరా! నిదురమానర
సోదర భారతవీరా!

(అని పాడుకొంటూ వెడలుపోవును)

శాంత :— ఇంక మన జెండా యెగిరిం దన్నమాటే.

ఘోష్ :— భారతదేశ సౌభాగ్యాన్ని ఎవరో దోచుకొని పోతున్నారు నా పూజ్యమాతను సంకెళ్ళతో బంధించి పడవలకుగట్టి లాగుతున్నారు — అని బాధపడటం మిగిలిపోయింది.

శాంత :— మీ వెనుకటి దినాలు జ్ఞాపకము వస్తున్నాయా!

ఘోష్ :— ఆ పార్కు రోమాన్సు నేను మరచిపోగలనా?

(తెర వాలును)

# దీవార్ కే రాత్రిగోడ

## ఏడవదృశ్యము

(విదేశవస్త్రాలలో విదేశీయనృత్యము చేస్తూ దాసు ప్రవేశించును భారతమాతయెదుట మోకరించి శాల్యూట్ చేసి)

గేయం

డియర్ మదర్ నమస్తే
మైడియర్ మదర్ నమస్తే !
వీరులకిడితివ బ్లెస్సింగ్సూ
పెంచితివమ్మా వారియర్సూ
ఆల్మైటీ కరుణారతితో
అనిశము ఫేమును ఆర్జించు !
డియర్ మదర్ నమస్తే
మైడియర్ మదర్ నమస్తే !
బలికి డొనేషన్ నేర్పించి
కర్ణుని వార్మన్ చేయించి
వరల్డు ఫేమును చేర్పించి
బ్యాంకు కట్టించినావోయమ్మ
డియర్ మదర్ నమస్తే
మై డియర్ మదర్ నమస్తే !

మై డియర్ మదర్! ఘనత వహించిన విదేశీయులద్వారా సంపాదించిన విజ్ఞానముతో మిష్టర్ నిన్ను ప్రార్థిస్తున్నాడు ఈ పుష్పాలను స్వీకరించు, ఇవి విదేశీయుల శయనాగారాలను

అలంకరించి, వారిఅనుపమ సంగీత సాహిత్యాలను అనుభవించి ఆనంద పార వశ్యములో జీవితము గడిపిన పుష్పరాజాలు అతిభక్తితో సీదాసానుదాసు దర్పించే కుసుమాలు అని నలిగిన కాగితపు పువ్వులను-తెలుపు-ఎఱుపు-పచ్చని పుష్పములను అర్పించును.

(ఇంతలో ఉష స్నాతయై ధౌతవస్త్రాలను ధరించి సెజ్జలలో పువ్వులతో ప్రవేశించును)

దాసు :—(ఈలవేసి సంజ్ఞజేసి పిలుచు) మై డియర్ శ్రీమతి ఉషాదేవీజీ అమ్మాళ్ గారు నా ప్రియమైన మంచి అర్ధశరీరమా రమ్మి !

ఉష:—(నిలువబడును)

దాసు :—ఈమె భారతమాత మన తల్లి. స్త్రీ పురుషులు కలసి ఆరాధించవలసిన తల్లి.

ఉష :—ఇది భారతమాత కాదు. మీ రనుభవించే దాస్యానికి గుర్తు దాన్ని మేము పూజించము.

దాసు : - (చేయి పట్టుకొని) రమ్మి. మన మిరువురము భారతమాతను పూజించెదము. నమోకరింపుము.

ఉష :—(చేయి విడిపించుకొని) ఇది రాజబాట. ఆమాత్రము జ్ఞానము లేదా; మనము పశువులము కాము, మనుష్యులము. ఎంత తెగించినా మంచి చెడ్డ లుండాలి.

దాసు :—(విరగబడి నవ్వి) మిస్టర్ దాస్ అభిప్రాయము నీ కర్థము కాలేదు. మిస్టర్ దాస్ మిసెస్ ఉషా హాజ్ బెండ్ సమ్జర్హా ! ఆమెనే రసజ్ఞులు మిసెస్ దాస్ అంటారు. కాదని సృష్టికర్తైనా అనలేడు. అది ఆకాశమందున్న పరమపిత ఆదేశము, శాసనము,అట్టిచో రాజవీధిలో భర్త కాడా ?ఇంటియందే భర్తయా? ఏమి విడ్డూరము! ఇది ఆధునిక నాగరికతసహించదు.

ఉష :—ఇవన్నీ కైపెక్కిన మాటలు. ప్రభులకు తగిన సేవకులు (అని వెడలిపోవును)

దాస్ :—భారతమాతా! స్త్రీలలో ధైర్యము లేదు. నిన్ను తల్లీ అని పిల్చి అవమానించను. మై డియర్ ఫాదర్ బ్లెస్సు మి. (అని తన టోపీని నెత్తిపై పెట్టి వెడలిపోవును)
(రామసింగు విచారముతో వచ్చి కూర్చొని) తల్లీ! నేను చేసిన ద్రోహ మేమిటి సేర్‌సింగు పరివర్తనానికి నేను చేసిన ద్రోహ మేమిటి! నా నీడవలె సంచరించే నా తమ్ముడు నాకు గర్భవిరోధియై పంపకాలవరకు పంతగించటానికి కారకు లెవరు! ఝాన్సీ అయిఉండదుకదా! స్త్రీ హృదయాన్ని అర్థము చేసికొనటము కష్టము. అకారణముగా నవ్వుతారు, ఏడుస్తారు, కన్నీళ్ళు కారుస్తారు, నమ్మకము కల్గిస్తారు. అవకాశముపొంది మంచిఅవసరములో గొంతుక కోస్తారు ఝాన్సీ అటువంటిది ఎందుకు కాకూడదు? కాని, నేను ఝాన్సీకి చేసిన ద్రోహమేమిటి? నా కన్నకూతురుకన్న యెక్కువ గారాబముగ పెంచితినే-కాలసర్పానికి పోసిన పాలే విషమవుతాయి. జానకిలో పూర్వపు పతిభక్తి కనబడటము లేదు. మానము లోనే అవమానిస్తోంది. విధేయతలోనే నిర్లక్ష్యము చూపిస్తోంది. మమకారము వెలిబుచ్చటములోనే తన పతితపావనత్వాన్ని వెదజల్లుతోంది. ఆమె సాహచర్యమే దుర్భరముగా ఉంది. ఈ భారతమాత అనుక్షణము మారిపోతోంది. కాని, పుత్రికలను వెంటగొని రాలేకపోతోంది. ఈ దృశ్యమే నా హృదయాన్ని చీల్చివేస్తోంది. బాహ్యలక్షణాలలో భారత మాత మారింది కాని, హృదయముమాత్రము మారలేదు.
(నిట్టూర్పు వదలి ఆమెపాదాలచెంత కెల్లపుచ్చునిగొని వెడలిపోవును)

(ఉష మరల వచ్చి ఆ నెత్తిమీది టోపీని నేల విసరి) ఈ బాని సల కీయలంకారాలలో ఉన్న అవమానము అర్థము కాదు. ఎంతమార్పు తెచ్చిపెట్టారు. అమ్మగారు వచ్చేవేళ యైనది. అదుగో జానకమ్మ ఝాన్సమ్మగార్లు ప్రవేశిస్తున్నారు.

ఝాన్సీ :-అక్కయ్యా! చూశారా భారతమాతను యెంత మార్చేశారో!

జానకి :—ఝాన్సీ! భారతమాత మారలేదు. భారతీయుల భాగ్యరేఖ మారింది. భారతీయుల కిరీటాలు మట్టిలో కలసిపోయి దారి ద్ర్యాన్ని సూచించే టోపీలు నెత్తిమీదికి వచ్చాయి.

ఝాన్సీ :—మీ మరదిచేష్టలు ప్రతిదినము భయంకరస్వరూపాన్ని ధరిస్తున్నాయి. రాను రాను సోదరులమధ్య దాటడానికి వీలు లేని సముద్రమేర్పడుతోంది. దాన్ని వారించే మార్గము మీ రాలోచించాలి.

జానకి :—నీవు నచ్చచెప్పకపోయావా!

ఝాన్సీ :—అక్కయ్యా! నే నెంతో ప్రయత్నము చేశాను. బావగారి విశాలహృదయాన్ని స్తుతిస్తూ అనేకపర్యాయాలు వాదించాను. నా పవిత్ర జీవితాన్ని శంకించేవరకు వాదించాను. నా కాపు రానికే భంగము వస్తుం దన్నభయముతో ఆ ప్రయత్నము నుండి విరమించాను.

జానకి :—పూజ్యపాదులు గాంధీగారు బోధము కలుగజేసికోలేదా!

ఝాన్సీ :—ప్రయత్నించారు. లాభము లేకపోయింది.

జానకి :—వారినికూడ పరాభవింపలేదుకదా!

ఝాన్సీ :—స్వార్థానికి భగవంతున్ని సందేశాని కపార్థము కల్పించి మానవుల పురోభివృద్ధి కడ్డమువచ్చే వంచకులని గర్వించి తిరస్కరించారు.

జానకి :— లాభములేదు. ఇంతవరకు వచ్చాక అధఃపతనమునుండి బ్రహ్మైనా రక్షింపలేడు.

ఝూన్సీ :— పూర్వసాంప్రదాయాలను నిందించి మానవ స్వాతం త్ర్యాన్ని అరికట్టే శృంఖలాలని, వాటిని నేలమట్టము చేయందే నేను నిద్రపో నని శపథముపూనారు.

జానకి : — ఈ మార్పులకు కారణ మెవరో ఊహించుకొన్నావా !

ఝూన్సీ :— ఊహించుకోవటమే కాదు నిశ్చయముగా నే నెఱుగుదును. కాని, లాభ మేమిటి ; ఆ వ్యామోహములో పడి అన్నగర్ములు మద్యానికి దాసు లైపోయారు.

పర్వతోన్నతశిఖరాల వదలి పారు
క్రూర కుటిలాగంబున గోవు పులియు
గొట్టుకొనిపోవ రక్షింప గోవునైన
లేడు భగవంతుడైనను లేడు త్రోవ.

జానకి :— కాని, మీ బావగారి హృదయములో పూర్వసాంప్రదా యాలమీది మమకారము తగ్గలేదు. దేశాభివృద్ధికి విదేశీ యుల జ్ఞాన మవసర మంటారు. దేశాన్ని సంస్కరిస్తానంటారు.

ఝూన్సీ: — నా విషయమై వారికి పట్టరాని ఆగ్రహముం దని గ్రహిం చాను. ఇదివఱకున్న పుత్రప్రేమ క్షీణించింది.

జానకి :— పొరబడుతున్నావు.

ఝూన్సీ :— లే దక్కయ్యా ! పితృహృదయము రుచిచూచిన నేను ఆ మార్పును గ్రహించలేనా ! కాని, నాకుమాత్రము వారి మీద గౌరవము తగ్గలేదు.

జానకి :— సేర్ సింగులోని మార్పునకు నీవే కారకురాల వని వారి నమ్మకము నే నెంతో నచ్చజెప్పాను. కాని, లాభము లేక పోయింది.

ఝూన్సీ : — నేను నిర్భాగ్యురాలను. భర్తృహృదయాన్ని పితృహృద యాన్ని ఒకపర్యాయమే పోగొట్టుకొన్నాను.

జానకి :—ఆ విషయములో నేను నీ కక్ష్యయ్యానే. సేర్ సింగు నన్ను చూడగనే చూపులోనే జుగుప్సను చూపిస్తూ తొలగిపోతున్నాడు. భర్తనా సాహచర్యములో ఆనందాన్ని అనుభవింపలేక అవమానింపబడ్డ వ్యక్తి విధముగా బాధపడుతున్నారు.

ఝూన్సీ :—ఇప్పుడు మనము చేయవలసినపని ?

జానకి :—అనుభవముకల వైద్యుడు రోగము పరిపక్వస్థితికి వచ్చిందాకా ఓర్పు వహిస్తాడు.

ఝూన్సీ :—రైతులు గొల్లుమని గోలపెడుతున్నారు. సామాన్యప్రజలు పన్నుకట్టలేక మలమల మాడుతున్నారు. అజ్ఞానపండితులు అవమానాన్ని పొందలేక పరారై పోతున్నారు. దీనజనులు తమ కష్టాలను చెప్పుకొనడానికై నా ప్రభుదర్శనము లభింపక నిరీక్షించి విసిగి, శపించి వెడలిపోతున్నారు. ఆర్యసాంప్రదాయాలను అర్థముచేసికొనకుండా విదేశీయులు తమ చర్యలను చూచి హాపసిస్తుంటే రక్తము ఉడుకెత్తి అనుభవజ్ఞులు ప్రభువులను నిందిస్తున్నారు. అయినా పరిపక్వస్థితికి రాలేదా ?

జానకి :—ఈ మార్పులవలన శూన్యహృదయాలేర్పడి సంసారాలు విచ్ఛిన్నమవుతున్నాయి. భార్యాభర్తలన్యోన్యము శంకిస్తూ బాహ్యలక్షణాలలోనే ప్రేమను సూచిస్తున్నారు. పవిత్రప్రేమ భారతభూమినుంచి పరారైపోయింది. అయినా ఇంకా సహించాలి.

ఝూన్సీ :—అన్నదమ్ములు ఒండొరులను నమ్మలేకున్నారు. తమ్ముడు ఆగ్రహపరవశుడై పంపకాలు కావాలంటున్నాడు. సంభవింపని పరాభవాలకు జన్మింపని దురాశలను, సాధ్యముకాని క్షుద్రహృదయాలను యీ మరది తన భావశబలతచేత సృష్టించుకొని అన్నయ్యపేరు చెప్పితే మండిపోతున్నారు. ఆదర్శనాన్నే

గర్జిస్తున్నారు. ప్రాతర్వందనము వదలి యెన్నాళ్లైందో జ్ఞాపకముందా ?

జానకి :—నే నంతా గమనిస్తున్నాను. సూర్యు డస్తమిస్తున్నాడు. పోదాము, రా !

రఘురాం :— ఆ రోదనధ్వని యేమటి !

జానకి :— ఏముంది రైతుల యరణ్యరోదనము.

(కొంతమంది రైతులు వచ్చి పాదముల వ్రాలుదురు)

జానకి :—నాయనలారా ! దుఃఖాలు మానవుని పరీక్షించే శోధనలు. ధైర్యముతో వానిని యెదుర్కోవాలి.

సహనశక్తియె మానవజాతి భూష
సహనశక్తియె చూపించు సాధుపంథ
సహనశక్తిని శర్వు దర్శనము కల్గు
సహనశక్తిని దుఃఖముల్ సమసిపోవు.

రైతులు :—తిండిలేక చచ్చిపోతున్నాము. అప్పులబాధ యెక్కువైంది కాటకము ఛాయలను కనుపిస్తోంది. నిరాశ బెదరిస్తోంది. మృత్యు దేవత ఆహ్వానాలను పంపిస్తోంది. (గేయం పాడుదురు)

ఏలయీపగిది జాలినిమాలీ
రైతుల రక్తము పీల్చుటలూ !
ఎంతటిఘనులకు నైననుగాని
క్రౌర్యమింత తగునా !
పేదనెత్తురే రుచికరమగునా
బీదలబాధల వినోదమగునా
కష్టముతీరే దారిజూపరా
జగతిని జాలీ మాయమైనదా !
ఏలయీపగిది జాలినిమాలీ
రైతుల రక్తము పీల్చుటలూ !

(జానకి ఝూన్సీలు తమ నగలను తీసి యిచ్చి) చంద్రినకు నూలు పోగు. యథాశక్తి తృప్తిపడండి.

(రైతులు మరల నిచ్చి) తల్లీ! అంత నీచులము కాము. ఆక లితో మాడి చావనైనా చస్తాము కాని. మా జననీసౌందర్యా నికి, అతి పవిత్రప్రేమకు కళంకము తెస్తామా!

ఝూన్సీ :—సోదరులారా! మీ గృహాలకు వెళ్ళండి సాధ్యమైనంత త్వరలో యీ కష్టాలకు మూలకందమైన కీటకాన్ని తొలగించి మీకు సౌఖ్యము చేకూరుస్తానని వాగ్దానము చేస్తున్నాను.

శ్వేతకీటక మొకటి యీ సీమ జేరి
సోదరద్వయ సుమ్మద్ధి వ్రిక్కజేసి
యష్టకష్టంబులను దెచ్చి యంటగట్టె
మనకు తొలగించి దాని సంపదల గూర్తు.

రైతు :—తల్లీ ? చిన్నమ్మవు. నీవు తలుచుకొంటే పర్వతాలనే పెల్ల గించగలవు, సెలవు. (అందరు నమస్కరించి వెడలిపోవుదురు)

ఝూన్సీ : (నిట్టూర్పు వదలి) ఆకలిమంటలో దగ్ధమైపోతున్నా భార తీయులు స్త్రీగౌరవాన్ని విస్మరించలేరు. ఇంతటి ఉదారస్వభా వుల కీ శ్రమ లెందుకో!

జానకి :—సూర్యచంద్రులకే గ్రహణ పరాభవము.

సృష్టి మురిపించి నెలిగించు శీతకిరణ
చండమార్తాండులకు గాడె శత్రుబాధ
గ్రహణములు మబ్బుచాటు నక్షత్రతతికి
కలదె యిటుకంటె బాధలు తెలియగలమె.

(తెర వ్రాలును)

# దీవార్ లేక రాతిగోడ

## ఎనిమిదవదృశ్యము

ఘోష్ భవనము.

......(శాంత హార్మోనియము వాయించుచుండ వినుచుండును)

ఘోష్ :—సేర్‌సింగు ! రా !

శాంత :—సేర్‌సింగు ! ఈమధ్య బిల్లీసింగు అవుతున్నావు.

సేర్ :—క్షమించాలి. నేను నిశ్చయించాను. ఈవేళ యేదో తేలిపోవాలి. మా అన్నయ్యకు ఉత్తరము వ్రాసి దాసుద్వారా పంపించాను. దాని కాపీ నాదగ్గఱ ఉంచాను.

శాంత :—ఏదీ చదువు సింగ్.

సేర్ :—డియర్ రామసింగ్

అన్నగారే రాజ్యము పాలించటాని కన్నివిధాలా అర్హులనే ఆర్యసిద్ధాంతములో అభిమానము అనుభవమువలన నశించింది. నేను కూడ-కాదు—నేనే రాజ్యాధికారినని—అర్హత కల అధికారినని పెద్దలభిప్రాయాన్ని తెల్పారు. నాకు ప్రత్యేకముగా రాజ్యము లేకపోతే నా సాంప్రదాయాలను, నా ఆశయాలను నెరవేర్చుకోవటానికి సాధ్యముకాదని అనుభవము వలన గ్రహించాను. తమరు లోకు లనుకొన్నంత మంచివారు కాదని నా అంతరాత్మ ఘోషిస్తోంది. మా వదిన తేనెవ్రాసిన కత్తి. ఇది చర్చించి తొలగించటానికి సాధ్యముకాని నా దృఢ విశ్వాసము. కనుక నా అర్ధరాజ్యము నా కొసంగ ప్రార్థించు

చున్నాను. అట్లు జరగనియెడల ఖడ్గసాయముతో సాధించగల నని మనవిచేస్తున్నాను.

జవాబున కెదురుచూస్తున్న స్వాతంత్ర్యప్రియుడు.
సేర్ సింగు.

ఘోష్ :— శైలి ఉరుకు లెత్తుతోంది.

శాంత :— సేర్ సింగుకత్తి కున్న వాడి కలానికికూడ ఉందని లోకము గ్రహిస్తుంది.

సేర్ :— మర్యాదకు రోజులు కావు. తెగించి వీధిని పడితేకాని వ్యవహారము పరిష్కారము కాదు.

శాంత :— ఈ ఉత్తరానికి కొన్ని కాపీలు తయారుచేసి కొన్నిముఖ్యములైన స్థలములలో అంటించుట మంచిది.

ఘోష్ :— అది ప్రశంసనీయమైన విషయమే.

సేర్ :— ఆఅవసరము లేదంటాను.

శాంత :— లేకపోతే ఆ ఉత్తరము నా కందలేదనవచ్చును.

సేర :— అల్లాగే చేయవచ్చును.

శాంత ;— దీనికి ఝాన్సీ అంగీకరించిందా!

సేర :— ఎల్లాగ అంగీకరిస్తుంది? బానిసత్వాని కలవాటుపడిన ప్రజలు బాధ్యతకల స్వాతంత్ర్యానికి భయపడి యేవగిస్తారు.

శాంత :— ఝాన్సీలో ఆ బద్ధకమే లేకపోతే.

ఘోష్ :— బద్ధకము కాదు. చవకరకము ప్రశంసకు పాటుపడటము.

సేర్ :— పెంకితనము. తనకు తోస్తేకాని చెయ్యదు. ప్రపంచము తల్లక్రిందులైనా తన మాటే నెగ్గాలంటుంది.

శాంత :— మరి యీ విషయములో అస్సలు రాదా?

సేర్ :— భర్త కెదురాడకూడదనే పిచ్చినమ్మకములో బాధపడుతూ అస్సలు రాలేదు.

శాంత :—అయితే మొన్న విందు కెందుకు రాలేదు ?

సేర్ :—(కంగారుపడి) నే నెక్కువగ బలవంతముచెయ్యలేదు.

(దాసు వచ్చి ఉత్తరము సేర్‌సింగు కిచ్చి తీవ్రముగ శాంత వైపు చూచును)

సేర్ :—(ఉత్తరము విప్పుతూ) నేను చెప్పలేదు. దెబ్బకు దయ్యము జంకుతుం దని.

శాంత :—(దగ్గఱకు వచ్చి) ఏ మనివుంది ? (అని ఉత్తరము లాగును)

ఘోష్ :—సేర్‌సింగును చదవనీ !

(శాంత కోపముతో తన కుర్చీపై కూర్చొనును)

సేర్ :—ఉత్తరము చూచి ఏమన్నారురా ?

దాస్ :—ఉత్తరము చదివి కన్నీళ్ళు కార్చారు. వేడినిట్టూర్పులు వది లారు. భారతమాతవైపు ఐదు నిముషాలు చూచారు, అంతలో జానకమ్మగారు వచ్చి చేతిలోని ఉత్తరము చదివి ఇంతవరకు వస్తుందని నాకు తెలుసు నని నవ్వి వెళ్లిపోయారు.

శాంత :—చిన్నమ్మగారా సమయములో అక్కడే ఉన్నారా ?

(దాసు కోపముతో సమాధానము చెప్పడు)

సేర్ :—ఝూన్సీ అక్కడే ఉందా ?

దాస్ :—ఉంది బాబూ ! కాని, ఆ అమ్మ యేమీ మాట్లాడలేదు. ఇంతలో ఎక్కడనుండి వచ్చిందో మా రాక్షసి. దీని కంతకు నీవే బాధ్యుడ వని, కుక్కా అని—

శాంత :—ఏమీ తగలనివ్వలేదుకదా !

దాస్ :—దానికి వెఱ్ఱికోపము. వద్దంటే ఇంకా చెలరేగుతుంది.

శాంత :—మంచిపని జరిగింది.

దాసు :—అటువంటిపని మీకు జరుగుతే మేము సంతోషించ వలసిందేనా ?

సేర్ :— నోరు ముయ్యి !

ఘోష్ :— ఉత్తరము చదవండి !

సేర్ :— నా ప్రియమైన సోదరా! అనేక సంవత్సరాలనుండి అతుకుకొని—పోయిన హృదయాలను చీల్చి వేరుచేయమన్నావు. ఆ బాధ నీకర్థముకాదు. ఈ సమయములో అర్థముచేసికొనుటకు ప్రయత్నించవు. నీ వీ కుటుంబానికి సంబంధించావనే విషయాన్నే మరచిపోయావు. నీ ఖడ్గానికి నేను బెదరను. నీ చిన్నబోయిన ముఖాన్ని చూచి యేడ్చి యేడ్చి క్రుళ్ళిపోతున్నాను. విభజించకుండా ఈ కుటుంబాన్ని నీవే పాలించు. నీ యాజ్ఞలలో నేనే జీవిస్తాను.

ఇట్లు నీ ప్రియసోదరుడు,
రామసింగ్.

దాసు :—(కన్నీళ్ళు కారుస్తూ) బాబూ! ప్రయత్నాలు మానండి. మీ అన్నగారి దీనదశ నేను కళ్ళార చూచాను. ఈ వియోగములో ఆయన హృదయము గసించుకుపోతుంది, మీ అన్నగారు దేవత. ఆయనహృదయము వ్రక్కలైపోతుంది,

సేర్ :—(నవ్వుతూ) పిచ్చి వెధవ. ఈ ప్రపంచములోని కపటనాటకాలను అర్థముచేసికోలేదు.

శాంతి :—మూర్ఖుడు-కన్నీళ్ళతో నే కరగిపోయే హృదయము. ఏడుస్తూ చెప్పిందంతా నమ్మి మోసగింపబడే మూర్ఖుడు.

దాసు :—ఇంక తగ్గితే బాగుంటుంది. అన్నదమ్ముల ప్రేమ అర్థముకాని-యంత్రాలు మానవుల విషయాలలో జోక్యము కలుగజేసికోవడము రెండుపక్కల మంచిది,

సేర్ :—ఓరేయి దాసు నోరు ముయ్యి !

దాసు :—(గద్గదస్వరముతో) బాబూ. క్షమించాలి, ఈ విభజనలో నా కేదో భయంకర పర్యవసానము కనబడుతోంది. అన్న

గారు ఈ పరాభవాన్ని భరింపలేక క్రుంగి చస్తారు. సహోదరుని విశ్వాసాన్ని పోగొట్టుకొన్నా ననే బాధ వారిలో అగ్ని పర్వతములాగ ఘోషిస్తోంది.

శాంత :—ఏమిరా! ఏమన్నా లంచముకొట్టావా?

దాసు :—ఆ బుద్ధి మా యింటిముందు కుక్కకైనా లేదు. ఇకముందు సహవాసదోషమువలన పట్టుబడుతుందేమో!

సేర్ :—ఓరేయి దాసు! ఇంకొకమాట మాట్లాడావంటే చీల్చేస్తాను, జాగ్రత్త!

దాసు :—బాబు! నాకు తోచింది చెప్పాను. తర్వాత ప్రభువుల ఇష్టము.

శాంత :—సేర్‌సింగు, జాగ్రత్త, మీ అన్నయ్య గొప్పరాజకీయవేత్త ఆ సమయములో నీవు కడుజాగ్రత్తగా ఉండాలి.

ఘోష్ :—ఆ సమయముతో మనముంటాముకదా! భయములేదు.

సేర్ :—పేరుకు మేము నిలబడ్డా వ్యవహారము మీరే పరిష్కరించాలి.

దాసు :—బాబూ!

సేర్ :—(కోపముతో చేతిలోని కఱ్ఱబెట్టి కొట్టి) పో వెధవా! శని గ్రహంలాగు తగులుకొన్నావు.

దాసు :—(కఱ్ఱను పట్టుకొని మీ చేతిలోంచి లాగి తిరిగి కొట్టేశక్తి నాకు లేకపోలేదు. కాని, మీ అన్నగారి మొగము చూచి సహించాను. సెలవు. తమకు హృదయపరివర్తనము కల్గాక మళ్ళీ దర్శనముచేసికొంటాను. అమ్మా! అన్నదమ్ములను విడదీసి పుణ్యముకట్టుకొంటున్నావు. ఈ అవస్థ మీ కెప్పుడైనా పట్టక తప్పదు. (వెడలిపోవును.)

సేర్ :—పిచ్చివెధవ—కాని, మా కుటుంబముమీద వెఱ్ఱి అభిమానము (మరలి వచ్చి) ఎప్పటికైనా మీ అన్నగారే దిక్కని

మరచిపోకండి. ఇవన్నీ వేసవికాలపు మేఘాలది ఉపకారము మాట యెత్తితే ఉఱ్ఱుంచి వెళ్లిపోతా మని జ్ఞాపకముంచుకోండి. (అని నమస్కరించి వెడలిపోవును.

సేర్ :—మిస్టర్ స్టుపిడ్ థేంక యు. (అందరు నవ్వుదురు.)

శాంత :—ఈ తెల్లవెధవల కెంతమర్యాద నేర్పినా పట్టుబడదు.

ఘోష్ :—కొన్ని శతాబ్దాలు పోతే కాని, మన సాంప్రదాయాలు వారికి పట్టుబడవు.

సేర్ :—పోనిద్దురూ! వెధవగోడవ! శాంతా! ఒకరాగము అందుకో!

శాంత :—గ్లాసులలో వైనను పోసి అందించి, ఇంగ్లీషు ట్యూనులో డ్యాన్సు చేయుచుండగ

(తెర వ్రాలును)

# దీవార్ లేక రాతిగోడ

## తొమ్మిదవ దృశ్యము

(దాసు ఉష భారతమాత విగ్రహముచెంత నిలువబడెదరు)

దాసు :— ఇప్పుడు నా కర్థమైంది. వాళ్లు యంత్రాలు. అక్కడ మమ కారము లేదు. ఆ ఉత్తరము చదువుతుంటే ఎంతటి హృదయ మైనా ప్రక్కలైపోవలసిందే? కాని, ఆ దెయ్య మణుమాత్ర మైనా చలించలేదు. ఆనందించింది.

ఉష :— ఇదివరకుదాకా వాళ్ళ పాదధూళికై ప్రాకులాడుతూ ఆ పద్ధ తులలోనే పరమానందము పొందేవాడవు.

దాసు :— అది సాలెగూడని నాకు తెలియదు. బాహ్యసౌందర్యా నికి మురిసిపోయాను. కాని, అందులో ప్రాణముతీసె పురుగుం దని అప్పుడు నా కర్థము కాలేదు.

ఉష :— మీ బాబుగారి కిప్పటికైనా అర్థమైందా!

దాసు :— ఇంకా ఆ వైపు తగ్గలేదు. మీరేవచ్చి విభజించా లని వాళ్ళనే మధ్యవర్తులుగా కోరుతున్నారు.

ఉష :— ఆ మహలుకూడా రెండుభాగాలు చేస్తారా!

దాసు :— రెండుభాగాలు చేయటమే కాదు. మళ్ళీ అన్నగారి మొగము చూడటానికైనా వీలు లేకుండా తరించటానికి సాధ్యముకాని గోడ కడ్తారట.

ఉష :— దాన్ని ఆపే పద్ధతి లేదా!

దాసు :— కష్టము. నేనెంతో యేడ్చి చెప్పాను. మొత్తుకొని చెప్పాను. కాని, లాభము లేకపోయింది పిశాచ మావహించిన సేర్ సింగు నన్ను చేతికఱ్ఱతో కొట్టటానికి యత్నించాడు.

ఉప :—ఘూాన్నమ్మగారు, జానకమ్మగారు వచ్చి మంచిసీళ్లైనా తాగటంలేదు. ఏమైనాసరే పునాదులు లేవకుండా చూస్తామని జానకమ్మగారంటున్నారు. అవసరమువస్తే తన రక్తమాంసాలతో ఆ పునాదులను పూడుస్తానంటున్నారు. అన్నదమ్ములను సంధించటానికి ఎంతత్యాగమైనా చేస్తానంటున్నారు. కాని, జానకమ్మగారుమాత్రము వెఱ్ఱివేదాంతముచెప్పి వాదిస్తున్నారు

దాసు :— అయితే జానకమ్మగారి భావము?

ఉప :—ఘూాన్నమ్మగారు కలుగచేసి నానటంవలన ఆ గోడ కట్టటం ఆగదు. కాని, ఆమెజీవితము మాత్రము సంపూర్ణముగా నాశనమవుతుంది అమాయకురాలనుజేసి జానకమ్మ ఆమె జీవితాన్ని నాశముచేసిం దనే అపఖ్యాతి తనకు వస్తుందని ఘూాన్నమ్మగారిని శాంతింపజేస్తున్నారు.

దాసు :—మానవజీవితములలో కొన్నిపరిస్థితులు హృదయపూర్వకముగా యేడ్వటానికిగాని, నవ్వటానికిగాని అవకాశమివ్వవు. అయితే మనము చూస్తూ ఊరుకోవలసిందే?

ఉప :—ఏమి చేస్తాము; కుటుంబకలహాలలో జోక్యము కలుగజేసికోకూడదు.

దాసు :—ఆ కుటుంబముతో మనకు సంబంధములేదా! వాళ్ళతిండితోకదా యీ రక్తమాంసా లేర్పడ్డాయి.

ఉప :—అవును నిజమే కాని, ప్రపంచ మంతమూరిపోలేదు.

దాసు :—మన మీా విషయములో మౌనమువహించుట మేమంత మంచిదికాదు.

ఉమ :—నా కొక ఆలోచన తట్టుతోంది. ఈ సరిహద్దులగోడలలో భారతమాత విగ్రహాలు ఉంటున్నాయి. అవి ఉంటూ నేలమట్ట మవుతోన్నాయని జానకమ్మగారు భయపడుతున్నారు. ఆ విగ్రహాలను నిర్మూలించకూడ దనే పేచీలోకి దిగుతే ?

దాసు :—బలే మంచి ఆలోచన చెప్పావు పేకహాంను పారవెయ్యి !

ఉమ :—ఇంకా తెగులు వదలలేదా ?

దాసు :—అలవాటైన అభ్యాస మంతసులభముగా వదలిపెట్టదు.

ఉమ :—అయితే వీధిగుమ్మమునగ్గఱ విగ్రహము ఎంతచప్పున నశిస్తే అంతమంచిది. కనుక ఉద్యానవనములోని విగ్రహానికే మనము పేచీపెడదాము.

దాసు :—ఆకారము మారినా అది భారతమాతేకదా !

ఉమ :—ఆ విగ్రహాన్ని చూచినపుడు భారతీయుల అధఃపతనము లోకానికి తెలుస్తుంది. కనుక, దాన్ని ముందరే నిర్మూలింపవలసింది. కాని, అంతధైర్యము లేకపోవుటవలన సహించాము. ఈ అవకాశములో ఆ పని గంధర్వులే చేస్తున్నారు.

దాసు :—కాని, యీ విషయములో నోరుజారి బాబుగారితో చెప్పకే !

ఉమ :—మగవారి నోట్లోనే నువ్వుగింజ నానదు.

దాసు :—అవును, ధర్మరాజుశాప ముంది అంటారు. ఆ కుంతీదేవిని నమస్కరించాలి; లేకపోతే ఈపాటికి చచ్చిపోయియుందును.

ఉమ :—ధర్మరాజుశాపములేని స్త్రీలతో పరిచయము కల్గిందికదా ! నడు నడు పోదాము !

(తెర యెత్తుదురు)

(రామసింగు జానకి ప్రవేశించెదరు)

జానకి :—ఈవిధముగా విచారిస్తే లాభమేమిటి? ఏదో తెగించాలికాని,

ప్రీగి రౌడమైనహృదయాల పెట్టిరక్తి
మరల బంధుల దలచుట మూర్ఖ్యమగును
సహజసౌందర్య ముంపదు జటిలభయద
శంక లుదయుంచులోపింప సహోనశక్తి.

రామ : — ఆ విభజనలో గల భాధ పి కర్థముకాదు. ఈ విభజన ఇద్దరిని సర్వనాశము చేస్తుంది.

జానకి :—కాని, నగిది ఆ బాధను అర్థముచేసికోలేనపుడు మీ రెంత బాధపడితే లాభమేమిటి ?

రామ :—ఝూన్సీ ఇంతద్రోహము చేస్తుందని నే ననుకోలేదు.

జానకి : ఆ విషయము నే నెన్నిసార్లు చెప్పినా మీరు నమ్మటము లేదు. ఆమె నిర్దోషురాలు.

రామ :— తన భర్త అభివృద్ధిలోకి వస్తాడనే భ్రమతో యెత్తు యెత్తిందని నా దృఢవిశ్వాసము. లేకపోతే, నిత్యము పాదారవిందము చేసే తమ్ముడు నన్ను గర్వించి శపించి ప్రచారముచేస్తాడా ?

జానకి :—ఆ విదేశీయులు కారకు లెందుకు కాకూడదు ?

రామ :—దీనివలన వాళ్ళకు లాభములేదు, ఝూన్సీకుంది.

జానకి : అక్కడే పొరబడుతున్నారు. ఝూన్సీ అమృతభాండము. మానములోనే సద్గుణ స్తవముచేస్తూ నేత్రజ్యోతులతో నిరాజన మిస్తూ, జనుల నాకర్షించే భారతీయపుత్రిక.

రామ :—ఆ మానములోనే సోదరులను విడదీసే వజ్రాయుధము దాగి ఉందని నా విశ్వాసము. ఆ కృత్రిమ నిర్లక్ష్యములోనే భరింపరాని స్వార్థము దాగిఉన్నదని నీ దృఢవిశ్వాసము.

(దాసు వచ్చి రామదాసుకళ్లు కట్టి యేడ్చును.)

రామసింగు :—(లేవదీసి) ఏమిరా ?

దాసు : —ఏముంది బాబూ ! అన్నదమ్ములమధ్య అగాధసముద్ర మేర్పడింది. దాని కంతకు ఆ దయ్యమే కారణము.

జానకి :... ఎవరురా ?

దాసు :—ఆ చెడపురుగు.

రామ:—అంటే ?

దాసు :—ఆశ్రయానికి వచ్చి మీ కొంపకు నిబ్బంటించిన కృతఘ్ను రాలు.

రామ :—ఏడిశావులే, నోరు ముయ్యి !

దాసు :—ఈ అమాయకత్వమే మీ కొంప ముంచుతోంది. చిన్న బాబుగారిని వాళ్ళు ఇంట్లో కూర్చోపెట్టుకొని నూరిపోస్తున్నారు ఈవేళో, రేపో పంపకాలు తేలా లంటున్నారు.

జానకి :—దీని కంతకు ఝాన్సమ్మగారే బాధ్యులని మా నమ్మకము.

దాసు :—(తెల్లపోయి) నేను బ్రతికే ఉన్నానా ! నేను వింటున్నది నిజమేనా ? జానకమ్మగారేనా చెప్పుతుంటా ?

రామ :—ఏమిరా అంత తెల్ల పోతున్నావు ?

దాసు :— అమ్మగారింత మారిపోతారని నే ననుకోలేదు. నిజాన్ని చెప్ప టానికింత జంకుతారని, ఒకళ్ళతప్పుకింకరికిగొంతుక కోస్తారని నే ననుకోలేదు.

(సేర్ సింగు ప్రవేశించి)

సేర్ :— ఓరేయి దాసు!

(దాసు పెడమొగము పెట్టును)

రామ :— సేర్ సింగు! రా ! కూర్చో, ఏమిటి విశేషాలు ?

(సేర్ సింగు కూర్చొని) మీతో కొన్ని ముఖ్యవిషయాలు మాట్లాడటానికి వచ్చాను. ఓరేయ్ దాసు నీ పనులకు పో !

దాసు :— సేర్ మీ సేవకుణ్ణి కాను.

(రామసింగు దాసువైపు చూచును. దాస్ లెంపలువైచుకొని వెడలిపోవును)

రామ :—జానకీ ! నీవు వెళ్ళి పూజాద్రవ్యాలు సిద్ధముచెయ్యి నే నిప్పుడే స్నానానికి వస్తాను.

(జానకి సేర్‌సింగువైపు చూచును కాని, లాభము లేదు. జానకి వెళ్ళిపోవును)

రామ :—నే నిదివఱకే అనుకొన్నాను.

సేర్ :—మీా కిదివఱకే యుత్తరము వ్రాశాను. దానికి మీారు చిన్నప్పుడు చదివిన రాజనీతినంతా ఉపయోగించి రామబాణము వదిలారు. కాని, ఆ మాత్రము శుశ్రూషమతో నేను సంతోషించను. నాకు పూర్తిన్యాయము కావాలి.

రామ :—సేర్‌సింగు మన పూర్వచరిత్రలు చదువుతే నీ కర్థమవుతుంది. విభక్తకుటుంబాలవలన వచ్చేనష్టాలు ఈ ఆస్తి అంతా నీవు తీసికొని ఆనందించు. నే నొక సేవకుణ్ణై నిన్ను సేవిస్తూ నా అనుభవసుసువలని విజ్ఞానముతో నిన్ను సేవిస్తాను.

సేర్ :—మిష్టర్ రామసింగ్ ! ఈ మాటలకు మోసపోయి సాష్టాంగ నమస్కారాలు చేసే దినాలు గతించాయి నూతనవిజ్ఞానము నా నేత్రాలను విప్పింది. ఇంక వెనుకటి చదరంగపు ఎత్తులు సాగవు.

రామ :—సేర్‌సింగు ! అటువంటి అనుమానమే నీ కుంటే ఈ భోగాలన్నీ నీవే అనుభవించు. నా కక్కర లేదు. ఈ కట్టుబట్టలతో ఏ కాశీకో; రామేశ్వరానికో పోయి ఉదరపోషణము చేసికొంటాను.

సేర్ :—దీని నే యుధిష్ఠిరరాజనీతి అంటారు. తమ రంత శ్రమపడవలసిన అవసరము లేదు. అన్నగారికి ద్రోహముచేశాడని ప్రజలలో ద్వేషమెక్కించడానికి తమ రీ యెత్తువేస్తున్నారని నాకు తెలుసును. నా వాటాలో ఎనిమిదణాలవంతుకంటె ఒకదమ్మిడీ యైనా యెక్కువ అవసరము లేదు.

రామ :—సేర్‌సింగు! తండ్రి చనిపోయేటప్పుడు చేయించిన వాగ్దానము జ్ఞాపకముచేసికో! తమ్ముణ్ణి ఎటువంటి పరిస్థితులలోను పరిత్యజింప నని భీషణశపధము పూనాను. దానికి భంగము చేయవద్దు.

సేర్ :—మిస్టర్ బ్రదర్! ఈ మూఢవిశ్వాసాలు నా భావిని ఎంత తమిస్రావృతముగ జేసినదో నాకిపుడర్థమైంది. ఈ పాపు మమకారముతో నే నధోగతిపాలైనాను. నా కా గొడవతో సంబంధము లేదు. నా వాటా నాకు కావాలి.

రామ :—దీర్ఘముగా ఆలోచించుకో! మరణించిన పుణ్యాత్ములు దుఃఖిస్తారు.

సేర్ —మరణించిన ఆత్మలకు దుఃఖించేశక్తి ఉంటే అన్నగారు తమ్మునకు చేసిన ద్రోహాల కిదివరకే గుండెలు బ్రద్దలై నశించవలసింది.

రామ :—నేను నీకు ద్రోహముచేశానా!

సేర్ :—శ్రీరామచంద్రులు లక్ష్మణునకు ఎందుకు చేస్తారు? పాపము! మీరు నిజేచ్ఛ జేయలేదు. మాతృభావము పైకి ప్రదర్శిస్తూ గోతులుత్రవ్వే జానకమ్మగారి ప్రోత్సాహమువలన తప్పనిసరిగ చేశారు. కారణ మేదైనా రావలసిన అధమాధమస్థితికి ఇంక పతనాన్ని నేను భరించలేను. నా వాటా నాకు కావాలి.

రామ :—దీనికి ఝాన్సీ అంగీకరించిందా?

సేర్ :—ఆ మూర్ఖురాలి అంగీకారముతో సంబంధము లేదు. ఆను దాని అడుగులకు మడుగులొత్తుతూ ఆ ప్రవర్తనాన్ని ప్రోత్సహించే వంచకుణ్ణి కాను. అక్కగారి కల్లబొల్లి యేడ్పులకు లొంగిపోయి తన గొయ్యి తానే త్రవ్వుకొంటోంది దాని ప్రారబ్ధము!

రామ :—సేర్‌సింగు—

సేర్ :—అనవసరముగా న న్నెందుకు బాధపెడతారు? మీ రెన్ని చెప్పినా అవిభక్తకుటుంబమువలన నష్టాలు నా రక్తమాంసాలలో ఖనితమైనాయి

రామ :—సరే! వాటాలు నీవే వేయి. నేను హృదయపూర్వకముగా అంగీకరిస్తాను కాని, భారతమాత విగ్రహాలను మాత్రము పాడుచెయ్యకు.

బ్రాహ్మణుల్ కడుభక్తి వైదికమంత్రాల
జీవించు యువతుల చేసిరెపుడో
తరతరంబులనుండి తండ్రితాతలు వీని
పూజించి రెంతయో ముగ్ధులగుచు
కులదేవతలవోలె కూర్చి సంపదలెన్నో
మోదింప ప్రజలును, భూతగణము,
యువకబృందము వీని యుజ్జ్వలచిహ్నల
మననంబు గావించి కనిరి యశము
అట్టి విగ్రహంబుల వీడి యంతులేని
సంపదల నిచ్చువచ్చినసరణి పంచి
వలయు భాగంబు కొనుము యర్పణముచేయ
కలుగు సర్వాధికారముల్ తొలగ శంక.

సేర్ :—మంచిమెత్తు వేశారు. నా దృఢనిశ్చయము వినండి. ఆస్తిని సమముగా పంచుకొని ఈ భవనముమధ్యగ గోడ కట్టాను. అది దుర్భేద్యమైన గోడ.

రామ :—అయితే చూపులుకూడ ఉండవన్నమాట.

సేర్ :—సాంప్రదాయాలలో, ఆశయాలలో విభిన్నత్వ మున్నప్పుడు చూపులు లేకపోవటమే మంచిది.

హృదయములు ప్రేమలేక శుష్కింప వాని
యొకట జేర్చిన ఘర్షణ నుడికి మంట
లోకముల కాల్చివైచు చికాకు హెచ్చు
కాన, దృష్టిని బడకుంట కర్తమగును.

రామ :—ఆ గోడ అవసరము లేదనుకొంటాను.

సేర్ :—కాని, నాకు కావాలి. ఆ స్థలనిర్ణయము ఆ దంపతులుచేస్తారు.

రామ :—ఆ దంపతుల కీ విషయములో సంబంధములేదు మనము పరిష్కరించుకోలేమా !

సేర్ :—మీ అనుపమాన రాజనీతికి జంకుతున్నాను. మీ యెత్తులు సామాన్యుల కర్థముకావు. కినుక, వారి సాయము నాకు తప్పకుండ కావాలి.

రామ :—ఆ అవిశ్వాసములో ఉన్న అవమానము నీ కర్థమైందా!

సేర్ :—విశ్వాసములో పతనము, అవిశ్వాసములో అభివృద్ధి ఉన్నాయని నేను విశ్వసిస్తున్నాను సెలవు. ఆ ప్రియత్నములో మీరుండండి.

రామ :—పోనీ ! ఈ భారతమాత విగ్రిహాలను రక్షించే షరతుపై విభజన సాధ్యమవుతుందా !

సేర్ :—ఆ విగ్రిహము లుండకూడదు. అవి భావిసంతతికి దాస్య శృంఖలాలు.

రామ :—సేర్ సింగ్ —

(సేర్ సింగు మాట్లాడక వెడలిపోవును)

రామ :—అధఃపతనము పూర్తిఅయింది. భారతమాతృవిగ్రిహాన్ని ఛేదించటానికి కూడ జంకటములేదు. మృతజీవులైన పితృదేవతల ఆత్మతృప్తికైనా యత్నించటములేదు. వెనుకటి అనుభవాలైనా స్మరించి తరించటములేదు. ఆ విదేశీయులను అడుగు పెట్టనివ్వటము నాదే తప్పు. ఆ పాపాన్ని శిక్ష ననుభవిస్తున్నాను. ఇంకా అనుభవిస్తాను.

(తెర వ్రాలుచుండును)

గేయం

ఎన్నాళ్ళుండెద యిహపరములలో
కొన్నాళ్ళేగదా జీవా !
వెళ్ళేప్పుడు వెంబడిరాదే
ఎండిన కొమ్మయినా !

న్యాయమైనా వాక్కు ఒకటి కడకీ
విశ్వమందుండేది !
పరదేశస్థుని పంపకములోనూ
న్యాయములేదురా జీవా !
నీకొరకై బ్రతికినవారిని
ద్రోహముచేయకు జీవా !

(అని భిక్షకుడు పాడుకుంటూ వెళ్ళిపోవును)

(అంతట తెరపడును)

# దీవార్ లేక భారతిగోడ

## పదవ దృశ్యము

(ఉద్యానవనములోని భారతమాతపూజ గావించి పుష్పములను కళ్ళ కద్దుకొని)

జానకి:—తల్లీ! నీ పుత్రులే తమ కఠోర కుఠారధారలతో నిన్ను నామ రూపాలు లేకుండా చేస్తున్నారు. నీ పుత్రులే అన్యోన్య విశ్వాసాన్ని పోగొట్టుకొని అధఃపతితులై నీ గౌరవాన్ని గంగలో కల్పుతున్నారు. నీ పుత్రికలను బలవంతముగా వేరు చేసి పూర్వసాంప్రదాయాలకు తిలాంజలు విస్తున్నాను. వ్యక్తి స్వాతంత్ర్యానికి ప్రేమకు అంతఃకలహాలు పెట్టి ప్రేమకుసుమకలకు ఉరిత్రాళ్లు తగిలిస్తున్నారు. ఇది నాకు సంకటస్థితి. విదేశీయుల చేతులలో కీలుబొమ్మై మరది నాశమవుతున్నాడని తెలుసును. కానివారించటానికి సాధ్యముకాని స్వార్థాన్ని నా మెడ కంట గట్టి నా చేతులు బంధించారు. నా మస్తిష్కాన్ని కాళీచే శాను, నా హృదయాన్ని పాషాణ సన్నిభము చేశారు, నా నేత్రాలలో జ్యోతి అనుక్షణము క్షీణిస్తోంది, తరణోపాయము చెప్పవా తల్లీ!

గేయం

ఎంతవారైతేను ఏమి! ఎంతపేరుంటేను నేమి!
విశ్వభారతి! నీదు పుత్రులింతేనా!
అనుకరణాలే వారి ఆశయాలౌనా!
ఎంతవారైతేను ఏమి! ఎంత పేరుంటేను ఏమి!

జాతీయతలు గంగ పాలుగానయ్యేను
స్వామితాభిమానమే నాశనమ్మయ్యె
ఎంతవారైతేను నేమి! ఎంత పేరుంటేను నేమి!
తల్లి! భారతమాత! తనయులకు యీరాత
తప్పదా! జాతికే ముప్పులున్నవి—రోత!
ఎంతవారైతేను నేమి! ఎంత పేరుంటేను ఏమి!

(అని మోకరించుదురు)

ఝూన్సీ:—తరుణోపాయ ముంది. సాహసించాలి.

జానకి:—(తల యెత్తి) ఎవరు? ఝూన్సీ! రా!

ఝూన్సీ:—అక్కయ్యా! మహర్షులా దేశించిన పవిత్రాశయాలే మన యెడల కుర్రితాళ్ళై అధఃపతనానికి లాగుకొని వస్తున్నాయి. పతిపూజ ప్రధమకర్తవ్యమైనా అది మానవత్వప్రదర్శనానికే అడ్డువచ్చినపుడు దాన్ని సమూలముగా పెల్లగించాలి. పతిని ధిక్కరించి నా కర్తవ్యాన్ని నెరవేర్చాలని నిశ్చయించాను.

జానకి:—ఝూన్సీ—

ఝూన్సీ:—అక్కయ్యా! ఆవేశముతో నా రక్తము సలసల కొత్తిపోతోంది నేను భారతీయ స్త్రీనని గర్వించటానికి అవకాశమై లేకుండా శుష్కమై, శిధిలమై భూతాలనూ స్వైరసంచరించే మృత్ప్రాయాచారము చేస్తోంది కనుక, ఆ గోడ కట్టకుండ ఆత్మార్పణము చేయాలని నిశ్చయించాను.

జానకి:—ఝూన్సీ! తొందరపడుతున్నావు. నీ వెవరి కుపకారము చేయాలని నిశ్చయించి యీ త్యాగానికి సిద్ధపడ్డావో, యెవరి యెడల కృతజ్ఞత చూపించటానికి ప్రయత్నిస్తూ అమూల్యమైన వస్తువు [illegible] పరిత్యజించటానికి సిద్ధమై నాతో ఆ వ్యక్తులనే తెలియకుండా అజ్ఞానములో, భరించరాని అవమానాల పాలు చేస్తున్నావు. ఆవేశమునుండి వెలుపలకు వచ్చి ఆలోచించుకో!

ఝాన్సీ :— నాకు తెలుసును నా త్యాగమువలన హృదయపరివర్తనము రాదని తెలుసును. ఆ త్యాగాన్ని లోకము నీచదృష్టితో విమర్శిస్తుందని నాకు తెలుసును. అటువంటి తలంపులు మీ మరణిలోనే బయలుదేరాయి. ఆ కుత్సితాభిప్రాయాలు మా యిరువురిమధ్య అసూహ్యమైన రాతిగోడను కట్టారని తెలుసును. నాకు పిచ్చెత్తిపోతుంది. నా రక్త మావిరైపోతోంది. నా మాంసము భూకంపములాగ అనుపమానవేగముతో యెముకలతో డీకీక్కలు కొట్టోంది.

జానకి ;— శాంతించు ! పరమేశ్వరునిమీద భారము వైచి శాంతించు !

ఝాన్సీ :— అక్కయ్యా ! క్షమించు ! నీ వేదాంతము నా కర్థము కావటమే లేదు. నీ ధైర్యము స్థైర్యాలను నేను అర్థముచేసికోలేకపోతున్నాను. కుడుగులు పడుతున్నా పిండివంటలుచేసి వడ్డించి అనుభవించే నేర్పు నా దగ్గర లేదు (గేయం)

వేదాంతబే కార్యజ్ఞతకును
విహితమార్గ మనుమా !
చేతులారగా
చింతమీరగా
చేసినపనులకు
ఫలమేమి ?
వేదాంతంబే కార్యజ్ఞతకును
విహితమార్గమనుమా !
యతనము లేకా
ఆశలుగనకా
అనుభ[illegible]ఁచే
ఆశయముమా ?
వేదాంతబే కార్యజ్ఞతకును
విహితమార్గ మనుమా !

(దాసు ఉష ప్రవేశించెదరు )

దాసు :—(జానకికి నమస్కరించి) తల్లీ ! దయయుంచి మా చిన్నమ్మ గారిని వదలివెయ్యండి, సంపూర్ణముగా మీవంటివాళ్ళ అను గ్రహము చూపిస్తేగాని మేము బ్రతుకలేము.

ఉష :—అమ్మా ! వెధవ ఆ స్త్రీకోసము లేతహృదయములను నలిపివే యాలని నీ కేలాగ బుద్ధిపుట్టింది ?

ఝాన్సీ :—దాసు ! నీ కేమైనా మతిపోయిందా ?

ఉష :—మాకు కాదు మీకు. విష మిచ్చినవాళ్ళకు విందులుచేసే మూర్ఖులము మేము కాదు.

జానకి :—(నవ్వి) దాసూ !

దాసు :—మీరు గుండెలుతీసినబంటు లండి. అక్కడ బాబుగారిని, ఇక్కడ చిన్నమ్మగారిని కోతులాడించినట్లు ఆడిస్తున్నారు.

ఝాన్సీ :—నోరు ముయ్యి !

జానకి :—ఝాన్సీ ! వాళ్ళ తప్పు లేదు. అమాయకులు ప్రభుభక్తి పరాయణులు. రాజారావు తుఫానుకు చేసే ప్రయత్నా లర్థము కాక ఆ హోరులో అందరిని తిట్టే అమాయకులు, నీ మీద మీ బావగారి కుండే మమకారాన్ని అభిమానాన్ని చంపక పోతే మీ రిరువురు అపనిందల పాలౌతారని నిశ్చయించి మీ యిరువురిమేలు కోరి యీ తగాదా నీ నెత్తిమీద వేశాను.

ఝాన్సీ :—అంటే ?

జానకి :—నీ పట్టుదలవల్లనే ఈ విభజన జరుగుతోందని మీ బావగారి యభిప్రాయానికి తాళమువేస్తూ పుట్టిన ద్వేషాన్ని పెంపొంద జేశాను.

ఝాన్సీ :—అయితే గోడకట్టటము తప్పదా !

జానకి :—తప్పదు. ఎన్నిప్రయత్నాలు చేసినా లాభము లేదు.

ఉప :—మా కొక ఆలోచన తట్టుతోంది.

ఝాన్సీ :—ఏమి టది ?

దాసు :—భారతమాతృవిగ్రహాన్ని పడగొట్టటానికి వీలులేదని పట్టు పట్టటము ప్రాణా లర్పించటానికైనా సిద్ధముగా ఉన్నామని తెగిస్తాము. బాబాయిని చిన్నప్పటినుంచి పెంచి పెద్దవాణ్ణి చేశాము కనుక, ఆ మాత్రము కనికరించక మానడు.

ఝాన్సీ :—ఆ ప్రేమలు ఆ మమకారాలు పోయి చాల దినాలైంది. ఇప్పుడు పట్టుదలమాత్రము మిగిలింది.

ఉప :—దేశాభిమానము సన్నగిలినా మమకారము తగ్గలేదనుకొంటాను అందులో బాబుగారికి మేమంటే యెక్కువఅభిమానము

జానకి :—దాసూ ! ఆ ప్రియత్నము మాను. ఈ ఉద్రేకములో నీ ప్రాణాలు తీయటానికైనా జంకడు. సోదరుని రక్తముతో తడసి భారతమాతృ శిలావిగ్రహ మవమానింపబడటముకంటె

దాసు :—మీరు వెయ్యి చెప్పండి, నూరు చెప్పండి. మే మెదుర్కొనక తప్పదు.

ఉప :—అవసరమువస్తే ప్రాణాలర్పించటానికైనా సిద్ధముగా ఉన్నాము

జానకి :—దూర మాలోచించుకోండి. ఇటువంటి త్యాగాలుచేసి ఆతణ్ణి ప్రజాదృష్టిలో పరమకిరాతకుణ్ణి చేయకండి. విదేశీయుల పాద ధూళి కెంతప్రీకులాడుతున్నాడో ప్రజలకు ఘోషించి చెప్పకండి. మీరు తిన్న అన్నానికి కృతజ్ఞులై ఉండాలంటే ఆ సమయములో మీ రక్కడ ఉండటమే మంచిదికాదు.

ఝాన్సీ :—అక్కయ్యా ! ని న్నర్థముచేసికొనటం కష్టము. నీవు దేవతాస్త్రీవని నా నమ్మకము. ప్రచండవాయువులు ప్రపంచాన్ని కంపింపచేస్తుంటే బొమ్మల పెళ్లిళ్లకు బట్టలుకుట్టూ పాటలు పాడుతున్నావు. నా మెదడు తిరిగిపోతోంది. నే నుండలేను. సెలవు. నా విధిని నేను నిశ్చయించుకోలేకపోతున్నాను.

(అని వెడలిపోవును)

ఉష :—అమ్మా ! మీలో రక్తము ప్రవహిస్తోందా ? మీ శరీరములో రక్తమాంసాలున్నాయా ! సామాన్యమానవులు పీల్చే గాలినే మీరు పీలుస్తున్నారా !

దాసు :—అణుమాత్రమైనా చలిస్తే, కన్నీళ్లు కారుస్తే, దీర్ఘనిశ్వాసాలు విడుస్తే మీరు మానవజాతికి సంబంధించినవారని నమ్మి ఉందుము. (అని వెడలిపోవుదురు)

జానకి :—సాధ్యమైనంతవఱకు సేర్ సింగును ఈ అధఃపతనమునుండి రక్షిస్తాను. ప్రతికూలవాయువులను తగ్గిస్తాను. మట్టితో రాతితో నిర్మించిన భారతమాతను ఛేదించగలడు కాని, హృదయాలలో తరతరాలుగా జీవించి పెంపొందే దేశాభిమానాన్ని ఛేదించలేడు. తాత్కాలికవాయువుల నుఱ్ఱూతలూగించినా ఉన్మూలితము కాకుండా రక్షించుకోవాలి. (మోకరించి) అమ్మా భారతమాతా ! భవనాన్ని విభజిస్తే నాకభ్యంతరములేదు. కాని, హృదయాలనుమాత్రము విడదీయవద్దు.

(అని ప్రార్థించును)

గేయం

వేడితినమ్మా ప్రియజననీ !
పాడితినమ్మా దయాధునీ !
విభజనమేలా
విముఖము లేలా
సంఘుప్రకోతలు
యివియేలా !
వేడితినమ్మా ప్రియజననీ
పాడితినమ్మా దయాధునీ !

కోటలుగోడలు
కూలిపోయినా
హృదయవిభజనము
లేకచేయవా
వేడితినమ్మా ప్రియజననీ
పాడితినమ్మా దయాధునీ !

(రామసింగు ప్రవేశించి) జానకీ! భారతమాత బానిసత్వ మనుభవించే దినాలు వచ్చినప్పుడు వారించటము బ్రహ్మకైనా తరముకాదు. పవిత్రహృదయ ముకల మీవంటిస్త్రీలు బాధ పడటము తప్ప పరివర్తనము కల్గక తప్పదు. ఎండమావులను చూచి దాహముతీర్చే స్వాదుజలాశయాలని భ్రాంతిచెందిన మృగాలు బాధపడక తప్పదు. కాని, ఒకటిమాత్రము గ్రహిం చు. పరిస్థితు లెంత భయంకరములైనా భారతవనితలలో పరివర్తనము తేలేవని నమ్ముతున్నాను.

జానకి :— మీరు వచ్చి యెంతసేపైంది ?

రామ :— చాలసేపైంది. ఝాన్సీహృదయాన్ని అర్థముచేసికొనే అవ కాశములభించింది. హృదయాలను చీల్చే మరదులనుకూడ మమకారములో ప్రజానిందనుండి రక్షించాలని పాటుపడే సీతామహాసాధ్వీలను చూచే అదృష్టము లభించింది. నా ఆస్తి అంతా పోయినా నేను విచారించను. నా పూజ్యసాంప్రదాయా లను రక్షించే పుణ్యస్త్రీ లున్నంతవరకు నాకు విచారములేదు.

జానకి :— మీ రాగ్రహానికి గురియై పంపకముచేసే సమయములో సేర్‌సింగులో దాగియున్న పాశవికశక్తిని పైకిలాగవద్దు. ఆ సమయములో మీరక్కడ ఉండకపోతేనే మంచిదేమో !

రామ :— ఉష, దాసు ప్రాణాలైనా అర్పిస్తాము కాని, విగ్రహాన్ని ఛేదింప సమ్మతింప మంటున్నారు,

జానకి :—మీరు నచ్చచెప్పండి. లేకపోతే శాశ్వితమైన అపకీర్తి సేర్ సింగు కంటుకొంటుంది.

రామ :—మన మెంత పూతపూసినా కుళ్ళినపండు వాసన కొట్టక పోతుందా ?

జానకి :—కాని, యుక్తిపన్ని అన్నదమ్ములను విభజించి ఆ కలహాలలో ఆనంద మనుభవించాలని ఉబలాట మెుందేవాళ్ళకు సాధ్యమైనంతవరకు శృంగభంగము చేయటము మన విధి.

రామ :—భారతమాతమీద గునపుపోటు పడినపుడు ఆ దృశ్యాన్ని చూచి రక్త ముడుకెత్తకుండా ఉండటము సాధ్యముకాదేమో!

జానకి :—సామాన్యప్రజలకు ప్రవేశించే అధికారము అరికట్టండి.

రామ :—దాసును, ఉషను ఆపటము కష్టమనుకొంటాను వాళ్ళు మన చేతులలోనే, సేర్ సింగుచేతులలోనో చనిపోవక తప్పదు.

జానకి :—ఈ దెబ్బతో యుగయుగాలునుండి వచ్చే వంశమర్యాద నశిస్తుం దనుకొంటాను.

భిక్షకుడు :—(పాడుకుంటూ) గేయం

బిచ్చమేయండీ! బాబూ! బిచ్చమేయండి
ప్రేమమీరగ చలువచేతిని
బిచ్చమేయండీ! బాబూ! బిచ్చమేయండి!

మాయజగతిని
మోసగింపుల
మిత్రులిడినా ద్రోహములచే
పేదనైనాను—నేను

బిచ్చమేయండీ! బాబూ! బిచ్చమేయండి
ప్రేమమీరగ చలువచేతిని
బిచ్చమేయండీ! బాబూ! బిచ్చమేయండి!

బాబూ! దీనుణ్ణి స్వార్థపరులైన మిత్రులను శత్రువులకు సమ్మి సర్వనాశనమైనాను. కాసిచ్చి కడుపుమంట నార్పరా!

జానకి :—రాబోయే దశను సూచించే శకునము. భావిని చిత్రించే దివ్యవాణి. (జానకి తన పర్సులో ఒకరూపాయి ఇస్తుంది. కళ్ళ నద్దుకొని భిక్షుకుడు.)

గ్రహములు వచ్చి పోవును కమలాప్తుని కది లెక్కా—
భూమికి సూర్యుడు పుష్పబాంధవునకు భూమి మిత్రులు కారా!
ఫిరంగి, చూపినా, గోడ కట్టినా ప్రేమ ఆపగ నీ తరమా
వెట్టియత్నాల మానుము తమ్ముడ విడదీయగ నీ తరమా.

(అని వెడలిపోవును)

రామ :—జానకీ! మిత్రులై వచ్చి శత్రువులై సాధించటము ఆపదలకు ప్రథమలక్షణము.

జానకి :— బెదిరేవాళ్ళను బెదిరించి చంపుటకు ఆపదలకు ప్రథమ లక్షణము.

రామ :—మళ్ళీ అవకాశము లభించునేమో! భారతమాతకు మోకరించి స్తుతించును.

(తెర వ్రాలును)

# శివార్ లేక శాంతిగీత

## పదకొండవ దృశ్యము

### * భారతమాత యెదుట *

ఘోష్ :— సేర్‌సింగు! ఈ విగ్రహాలలో పూర్వుల అజ్ఞానాన్ని అహంకారాన్ని మనము స్పష్టముగా తిలకించగలము.

శాంత :— లలితకళలకు జన్మస్థానమని విఱ్ఱవీగు ఈదేశములోనే ఇటువంటి శిలావిగ్రహా లుంటము హాస్యాస్పదము.

సేర్ :— నా నిశ్చయ మిదివఱకే స్పష్టముగా చెప్పాను. మీ రణుమాత్రమైనా మెత్తపడవద్దు. అవసరమువస్తే ప్రాణాలుతీయటానికైనా జంకకూడదు, మీ తుపాకీలన్నీ గుండ్లతో నింపి ఉంచారా!

ఘోష్ :— మేము మతబోధచేసేటప్పుడుకూడ మందు దట్టించిన మరఫిరంగులను మరచిపోము. ఆత్మశాంతికి ప్రార్థించే సమయములోకూడా ప్రాణాల నపహరించే పరిస్థితులను కల్పించటములో జంకము.

సేర్ :— అది వేఱే చెప్పాలా! ప్రతిదినానుభవమే కాని, మా అన్నయ్యను చూచి మెత్తపడ్డారంటే కొంప మునుగుతుంది. సాధ్యమైనంత రాబట్టటమే మన పని.

శాంత :— అరుగో మీ అన్నయ్య వస్తున్నారు. ఆ ముఖములో నెత్తురుచుక్కైనా లేదు. ఏదో పోగొట్టుకొన్నవాడు పడే బాధ ననుభవిస్తున్నారు.

సేర్ :—అవును. గాదెక్రింద పందికొక్కు కా మాత్రము బాధ ఉండకతప్పదు.

(రామసింగు వచ్చును. అందరు నమస్కరించెదరు)

ఘోష్ :— వ్యవహారమంతా పరిష్కార మైనవెనుక ఈ చిన్నివిషయ ములో పట్టుదల అర్థములేనిది.

శాంత :—అన్నదమ్ము లెప్పటికైనా కలుసుకోనక తప్పదు. కనుక, ఈ స్వల్పవిషయములో రక్తపాతాలకు దిగటము మంచిది కాదు. సేర్ సింగుకు పిచ్చికోపము. అతనికి తన రివాల్వరులో ఉన్ననమ్మకము. తన నాలుకలో లేదు. కనుక,మీ రేకోంచెము వెనుకకు జంకుతే మంచిది.

భావి పరికించి పొంగు తత్త్వంబు కాంచి
శాశ్వతంబుగ నిల్చు యశంబు తలచి
వెనుక ముందుల చర్చించి పెద్ద లెపుడు
కార్యమును జేయువారు సౌఖ్యంబు కోరి.

రామ :— శాంత ! భారతమాతను మే మెంత ప్రేమిస్తామో మీ కర్థముకాదు. నా ఆస్తిఅంతా తమ్మునికి ధారపోస్తాను. ఒకఅర అంగుళమైనా స్థలముకాని, ఒకచిల్లుగవ్వకాని నే నపేక్షింపను భగవంతు డిచ్చిన హృదయము, మస్తిష్కము, శారీరకబల మున్నాయి కాని, నే నారాధించేమాతను, నా యెదుటనే ఛేదించటము నేను భరించలేను.

తుచ్ఛసౌఖ్యంబులను గోరి దోషరహిత
దేశభక్తిని పోనాడ తో[illegible]
కీర్తి విత్తంబు, ప్రాణముల్ ; కీర్తిధనుడు
లెక్కచేయునె, వాని నర్పింపలేడె
దేశమును గొల్వధాని స్తుతింప సతము.

సేఠ్ :—శాంతా! ఆ కపటనాటక మింక సాగదని చెప్పు. సమముగా రెండువాటాలు వెయ్యవలసిందే. అంత అభిమానముంటే సువర్ణవిగ్రహాన్ని సృష్టించి పూజామందిరములో పెట్టి రత్న మాణిక్యాలతో పూజించుమని చెప్పు.

శాంత :—మట్టిబొమ్మల కింతప్రాధాన్య మిచ్చి రక్తాన్ని పారించటము పండితలక్షణము కాదు. దేశభక్తి హృదయాలలో ఉందికాని, విగ్రహాలలో లేదు.

రామ :—సమయానుకూలముగా దుస్తులు మారుస్తూ స్వార్థానికి సత్యాన్ని సర్వము బలిచేసే సామాన్యులకు విగ్రహపూజలో గల మర్మము అర్థముకాదు. శుష్క హృదయాలు మాతృచుంబనములో ఉన్న మమకారాన్ని అర్థముచేసికొలేవు.

క్షుద్రవాంఛల నెరవేర్ప నూరిగర్వాళి
తత్త్వముల నేర్పి సత్యంబు తారుమారు
చేయు మూర్ఖుల కెఱుకయే శీలవంతు
లరుగు మార్గంబు వేశ్యల కర్థమగునె
పతిని సేవించి మోదించు పడతిపంథ.

సేఠ్ :—తడిగుడ్డలతో గొంతుకలు కోసే వంచకులకు ఆవదాలు చాల సాయముచేస్తాయి.

శాంత :—రామసింగుగారూ! ఈ విగ్రహాలలో మీ కింత మమకారముంటే మేము కొంచెము శంకించవలసి ఉంటుంది. భారతీయులు విగ్రహాలలో రత్న మాణిక్యాలు దాస్తారని చరిత్రలు సాక్ష్యమిస్తున్నాయి.

ఘోష్ :—నీవు నిజముచెప్పావు. కాశీవిశ్వనాథదేవాలయము దానికే సాక్ష్యమిస్తోంది.

రామ :—మా తాత ముత్తాతలనుండి పూజింపబడుతోందనే మమకారమే. రత్నాలు. మాకు భాగ్య భోగ్యాలిస్తోందనే కృతజ్ఞతయే మాణిక్యాలు.

సేర్ :—మిష్టర్ ఘోష్ ! ఈ వెఱ్ఱి మొఱ్ఱి సమాధానాలు నాకు నచ్చవు మర్యాదగా చెప్పుతున్నాను. ఈ విగ్రహాలను ఛేదించక తప్పదు. శక్తి ఉంటే రక్షించుకోమను.

శాంత :—మధ్యవర్తులము మె ముందుగా తొందరపడకూడదు. మిష్టర్ రామసింగ్ ! వ్యాపారము ముదరకుండా పెద్దలము మనమే తగ్గుతే బాగుంటుంది.

రామ :—విదేశీయాచారవ్యవహారాలలో జీవించిన మీ రీ సాంప్రదాయాలను మరచిపోయారంటే ఆశ్చర్యములేదుకాని, యీ దేశములో పుట్టి ఈ సాంప్రదాయాలలో జీవిస్తూ వాటినే అవమానిస్తున్నారంటే ?

శాంత :— ఆ భక్తి పవిత్రమైందైతే అందరికి అర్థమవుతుంది.

సేర్ :—ఈ చర్చలతో నాకు సంబంధములేదు.

(అని గునుప మెత్తును)

(రామసింగు మౌనమును వహించును)

(ఎచ్చటినుండియో వచ్చి దాసు విగ్రహమును కౌగలించుకొనును. ఉష సేర్ సింగుకాళ్లు పట్టుకొని) బాబూ ప్రార్థిస్తున్నా ! ఈ ప్రయత్నమునుండి విరమించండి.

విగ్రహంబుల ఛేదించి వ్రేళ్ళతోడ
పూర్వ సంస్కృత్యవిద్యంబు బూడె కలుప
వలదు, రక్షించి మీరు సుపర్వ వినుత
యశము నొందుడు మోదింప నగ్రజుండు.

సేర్ :—(కాళ్ళతో గెంటి) దొంగముండా పో !

రామ :—సేర్ సింగ్ ! ఎప్పుడైనా స్త్రీలను నిందించి మెఱుగుదువా ?

సేర్ :—దొంగముండా పోయి అటువంటి నాటకాలు నా దగ్గఱ సాగవని మీ యజమానితో చెప్పు

ఉష :—బాబూ! పొరబడుతున్నారు; అమ్మగారికీ విషయములో సంబంధము లేదు. ఆమె ఈ పరిస్థితులలో తోటకు వెలుపల లేకుండా ఉన్నారు.

శాంత :—యజమానుల కలహాలలో సేవకులు జోక్యము కలుగజేసికోకూడదు

ఉష :—యజమానులు మూఢులైనపుడు సేవకులు సంస్కరిస్తారు.

శాంత :—అదే భారతీయులలో ఉండే అహంకారము.

ఉష :—అబ్బో భారతీయుల తత్త్వాలు ఈ పురుగుల కర్థమైనాయి. బట్టవిలువ తెలియకుండా తెగకొరికే చెదపురుగులు వేదాంతము బోధిస్తున్నాయి.

సేర్ :—ఒరేయి దాసూ!

దాసు :—బాబూ! తమ అధికారానికి లోబడే దినాలు గతించాయి. ఈ బెదిరింపులకు బెదిరి మా భారతమాతను మేము పోగొట్టుకోలేము.

ఉష :—అవసరమైతే ప్రాణాలైనా అర్పించి ఆమె గౌరవాన్ని రక్షించుకొంటాము.

ఘోష్ :—ఓహో శ్రుతి మించిపోయిందే! రేపటినుంచి భారతదేశంములో కూలీ, రైతుల రాజ్య మేర్పడుతుం దనుకొంటాను.

శాంత : దాన్నే ఈ దేశములో ప్రజారాజ్యమంటారు. చాకలిమాటల కగ్రతాంబూలమిచ్చి సంసారాన్ని పాడుచేసుకొన్న శ్రీరామచంద్రుడు దేశానికి పూజ్యుడు.

సేర్ :—అయితే ప్రాణాలకు తెగించారన్నమాట.

దాసు :—మీ రెంతదూరముపోతే అంతదూరము రావటానికి సిద్ధముగానే ఉన్నాము.

ఉష :—ఈ అవమానము కళ్లార చూచి బ్రతకటంకంటె మరణించటమే మేలనుకొంటాను.

సేర్ :—కడసారిమాట చెప్తున్నాను. దూరముగా ఉండండి.

రామ :—ఓరేయి దాసూ! ఆ విగ్రహాన్ని వదలి దూరముగా ఉండు ఉషా! లోపలకు వెళ్లు.

దాసు :—క్షమించాలి, మా విధిని మేము గుర్తించాము.

ఉష :—ఈ విధేయతను కృతఘ్నతను అనకండి.

ఘోష్ :—అనవసరముగా ఎందుకు తెగిస్తారు.

ఉష :—తమరీ సమయములో నోరుమూసుకొని ఉంటే బాగుంటుంది. మీకు తెలియని విషయాలు ప్రపంచములో లేవనే పద్ధతిలో చెలరేగుతున్నారు. తమరీ దేశములోంచి యెంతచప్పున వెళ్ళితే అంతమంచిది.

సేర్ :—ఓరేయి నోరు మూస్తావా మూయవా? ఏమన్నా తాగి వచ్చావా?

దాసు :—అది మీవంటి గొప్పవంటివాళ్ళకు చెల్లుతుంది కాని, మా బోటి బక్కవాళ్ళకు కాదు. అందులో అమ్మగారిచేతిలో అది అమృతమేకదూ!

సేర్ :—(లెంపకాయి కొట్టి) మళ్లీ కూయి!

రామ :—సేర్‌సింగు! నీ ఆర్యసాంప్రదాయాల కెంతద్రోహము చేశావో ఆలోచించుకొన్నావా? ఎప్పుడైనా సేవకుల నీ విధముగా అవమానించావా?

సేర్ :—ఆ ధర్మోపన్యాసా లెన్నైనా చేయవచ్చును. ఇంతపొగరుగా యెప్పుడైనా మాట్లాడారా! ఇచ్చారు సూపర్; నెత్తిమీదికి కళ్లువచ్చాయి.

శాంత :—అప్పుడప్పుడు ఆ మాత్రము రుచి చూపించకపోతే మరీ చెలరేగిపోతారా పాటకపుజాతి.

ఉష :—పెద్దమ్మవు, నీ వడుగుపెట్టాక ఎన్నిమార్పులైనా వస్తాయి. అందులో వెట్టులెత్తించే అమృతాన్ని ప్రసాదించి, మానవత్వాన్ని సరదాగా నిర్మూలించే పెద్దమ్మవు.

రామ :—ఆగండి. అనవసరపు చర్చలలోపడి ఎందుకు బాధపడతారు. సేర్ సింగు! నీ నిశ్చయాన్ని చెప్పు!

సేర్ :—ఈ విగ్రహాలను నిర్మూలించక తప్పదు.

రామ :—దానివలన నా కెంత బాధ కల్గుతుందో ఆలోచించుకొన్నావా ?

సేర్ :—అది నా కవసరములేదు. నా ఆనందమే నాకు కావాలి. నా అభివృద్ధే నాకు కావాలి.

రామ :—అయితే మాటలతో పనేమిటి ? దాసూ వెళ్ళిపో !

దాసు :—బాబుగారూ ! మా ప్రాణాలనైనా బలియిస్తాము కాని, భారతమాతను చేధించుటకు అంగీకరించము.

ఉష :—చావు కిన్నిచావులు లేవు. ఎప్పుడైనా చచ్చేదే ! కాని, అవమానములోను, దారిద్రములోను మరణించటంకంటె యీ మార్గము వెయ్యిరెట్లు మంచిది.

రామ ;—అది అర్థములేని త్యాగము. దీనివలన హృదయపరివర్తనము కలుగదు.

సేర్ :—ఓరేయి దాసూ లే! లేకపోతే చచ్చిపోతావు.

దాసు :—అన్నిటికి సిద్ధము. (అని భారతమాతను కౌగిలించుకొనును)

ఉష :—మా శరీరములో ఒకనెత్తురుచుక్క ఉన్నా ఆ నెత్తురుచుక్కలో పీసమెత్తు ప్రాణమున్నా మేము మా తల్లిని వదలము.

సేర్ :—అయితే అనుభవించండి (అని రివాల్వరు ప్రేల్చును)

దాసు :—బోలో భారమాతకు జై ! స్వతంత్రభారత్ కీ జై ! (అని భారతమాతచెంత పడి ప్రాణములు వదలును)

సేర్ :—ఉషా !

ఉష :—ఆ అదృష్టానికి నేను సంసిద్ధురాలనే.

రామ :—సేర్ సింగు ! ఆమె స్త్రీ. పుత్రికవలె గారాబముగా పెంచిన యువతి.

శాంత :—న్యాయశాస్త్రములో స్త్రీ పురుష వివక్షణ లేదు.

ఘోష్ :—నిజము చెప్పావు. స్త్రీ లంత తెగించకూడదు.

రామ :—సేరుసింగు ! పూర్వ సాంప్రదాయాలను స్మరించు స్త్రీ ఆరాధ్య దేవత.

సేర్ :— ఉషా ! ఏదో నిశ్చయముచేసికో !

ఉష :—నా ప్రాణాలుండగా మీ రా విగ్రహాన్ని తాక లేరు.

సేర్ :—(రివాల్వరు పెట్టి కాల్చును)

ఉష :—ధన్యురాలను. సేర్ సింగు ! ఇప్పుడు నీ యిష్టమువచ్చినట్లు గోడకట్టు ఆ గోడమీద ఈ పూజ్యదంపతులకు బంగారు మేడలు కట్టించు; కాని, ఒకసంగతి జ్ఞాపకముంచుకో! నీగోడలు ఆ మేడలు స్వల్పకాలములోనే కాలగర్భములో లీనమౌతాయి అనతి కాలములోనే భారతమాత తన పుత్రుల ధైర్యస్థైర్యసాహసాదులకు సంతసించి ఆసద్గుణాలను నేర్చుకోవటానికి విదేశీయులను ఆహ్వానిస్తుంది. కొలది కాలములోనే విభజించి లాభముపొందే స్వార్థపరులు తమ అజ్ఞానానికి పశ్చాత్తాపమొందుతూ పరారయ్యే దినాలు వస్తాయి. బోలో భారతమాతకీ జై జై హిందూ స్వతంత్రనికీ జై !

(అని చనిపోవును)

రామ :—వీరస్వర్గ మలంకరిస్తున్నారు. ప్రభువులు ప్రజలకు మధ్య ప్రవహించే రక్తప్రవాహాని కిది ప్రారంభోత్సవము.

(అని వారి ఆత్మల నాశీర్వదించి వెడలిపోవును)

శాంతఘోష్ ఆనందించుచుండ సేర్ గునుప మెత్తును.

(తెర వ్రాలును)

# శ్రీవార్ లేక భారతిగోడ

## పన్నెండవదృశ్యము

సేర్‌సింగు శయనాగారము

ఘూన్సీ :—ఇప్పటికైనా అర్థమైందా! విదేశీయుల వాత్సల్యము. ఇతర నాగరకతలు భారతదేశములో జీవించలేవని ఇప్పటికైనా అర్థమైందా!

సేర్ :—ఇదంతా మా అన్నయ్య, మా వదిన చేసిన మోసము. రైతుల కెదురు తిరుగమని ప్రోత్సహించి నన్ను అవమానించాలని యత్నిస్తున్నారు.

ఘూన్సీ :—ఇంతకాలము వాళ్ళతో జీవించినా వాళ్ళ తత్త్వము అర్థము కాక పోవటము మన ప్రారబ్ధము. మీ రివాల్వరుగుళ్ళ కెరకాకుండా నన్ను బలవంతముగా ఆపిం దెవరో తెలుసునా! మీరు కట్టిన గోడకు, ఆ విదేశీయదంపతులు సాయంకాలము స్వైర విహారముచేస్తూ రెండుపక్షాలను ఉడికెత్తించే గోడకు నా రక్త మాంసాలతో పునాదులువేయకుండా ఆపిం దెవరో తెలుసునా! మీ వదిన జానకి ఆమె సాక్షాత్ లక్ష్మి, సీతామహా సాధ్వి.

సేర్ :—నేను నమ్మలేను. పూర్వము చూపించిన భక్తి విశ్వాసాలను ప్రజలు చూపించటములేదు. ఆ విదేశీయదంపతులను “పొండి బాబూ బ్రతికిపోతా” మని ముఖముమీదే ఖచ్చితముగా చెప్పుతున్నారు. మీ వలన సస్యశ్యామలముగా ఉండే మా

దేశములో క్షామాలు బయలుదేరాయి. దానికి మీరే కారకులు. పోండి, మీరు మా కక్కరలేదని చెప్పుతున్నారు. అన్నగారి ప్రోత్సాహ ముండకపోతే వాళ్ళకా ధైర్యమెక్కడిది?

ఝాన్సీ :—మీ అన్నగారే తలుచుకొంటే ఈ గోడలో ఒక అంగుళమైనా కట్టకుండా చేయగలరు. ఈ విచిత్రదంపతు లొకక్షణమైనా ఈ దేశములో గాలిపీల్చకపోయి ఉందురు. మీ అన్నగారే తలుచుకొంటే హింసనో, అహింసనో సాధనముగా తీసికొని మీ కందఱకు తాగటానికి గంజైనా లేకుండా చేసి ఉందురు. కాని, అట్టిప్రయత్నాలలో మీ కవమానముందని, ఏకగర్భజనితు లవటమువలన ఆ పరాభవములో తమకుకూడ భాగముందని సహించారు. మీ వదిన యీ విభజన లోకము గుర్తించకుండ సాధ్యమైనంతవఱకు ఆపింది. ఆమెను ప్రజలు దేవతగా పూజిస్తున్నారు.

సేర్ :—కాని —

ఝాన్సీ :—నన్ను పూర్తిగా చెప్పనియ్యండి. ఆమె నోటినుండి ఒక మాటైనా చాలును, ప్రజల రక్తాన్నుడికించి ఈ గోడను ముక్కలు ముక్కలుగా చేయటానికి. కాని, శాంతించింది అవమానాన్ని సహించింది కృతఘ్నతను అయాచితమునా క్షమించింది. అనార్యజుష్టములైన అత్యాచారాలను అపహసించింది. ఆమె గొప్పతనము గుర్తించలేక, ఆ స్థానములో మీ కున్న పరాభవాన్ని ఊహించలేక పతితులై పోతున్నారు. నా కర్థమైంది. మీ అభివృద్ధికి ఆ దంపతులు చేసిన త్యాగాలు భయంకరస్వరూపాన్ని తాల్చి నా మస్తిష్కాన్ని తింటుంటే నాలో నేనే కుళ్ళిపోతున్నాను. అయినా, మీకు జాలిలేదు. మీ పతనానికి పశ్చాత్తాపములేదు.

సేర్ :—ఝూన్సీ! బాహుబలమువలన ప్రజలను శాసించగల ననే ధీమాతో గోడ కట్టాను. కాని, వాళ్ళ ప్రభుభక్తి కర్థమవుతోంది, ఆ త్ర శస్త్రాలుపయోగిస్తేకాని లభించని పన్ను మా అన్నగారికి వాళ్ళంతట వాళ్లే తెచ్చి ఇస్తున్నారు. ఆ పూజ్యదంపతుల పటాలను పూజామందిరములో పెట్టి పూజిస్తున్నారు. నన్ను ఆ విదేశీయులతో జమకట్టి అన్యోపదేశముగా నిందిస్తున్నారు. నా మెదడు తిరిగిపోతోంది. ప్రజలను శాసింపలేవా అని ఆ వృద్ధదంపతులు హాస్యము చేస్తున్నారు.

ఝాన్సీ :—కనికరించిన మీ అన్నగారి దశను చూడండి,

పాపపంకిలమగున్నదై బ్రతుకు గనుక
విశ్వవందిత తత్వాల పెల్లగించి
దగ్ధమొనరించు సోదరు దశకు కుళ్ళి
మంచమెక్కిన సోదరు మరచినారె
పొందు రక్షించి సత్కీర్తి పొందుదేరు.

పశ్చాత్తాపానికైనా సమయముంది,

సేర్ :—తనకు జబ్బుచేసిందని మనకు వర్తమానమంపాడు! మావదినె అయినా వార్తపంపించిందా!

ఝాన్సీ:—ప్రభూ! ఇది శుష్కసాంప్రదాయాలకు పెనుగులాడే సమయముకాదు. మీ అన్నగారు, శ్రీరామచంద్రుని స్మరింపజేసే మీ అన్నగారు మృత్యుదేవతతో పెనుగులాడుతున్నారు. అకాలమృత్యుముఖములో ప్రవేశిస్తున్నారు. ఈ స్థితికి మీరే కారకులని ప్రజలు గుర్తించారు. కనుక, ఇప్పటికైనా ఈ గోడను నిర్మూలించి హృదయాలను ఏకముచేయండి. వెనుకటి దృశ్యాలను ప్రజలకు చూపించి ఆశీస్సులను పొందండి.

సేర్ :—నీ ఆవేశపూరిత శబ్దజాలములో ఉన్న సత్యాన్ని చూడటానికి కొంత సమయము కావాలి.

వాయువును మించు వేగాన పోయె నదిని
కొట్టుకొనిపోవు మానవు కొదువబుద్ధి
భ్రష్టమగునట్లు నీ శబ్ద వనధి మునుగు
నాకు తెలియదు మార్గంబు నరయవలయు,
సమయమెక్కింత నొసగువో జలజ నయన.

ఝాన్సీ :—నాథా ! మీకోసము కాలము ఆగదు. మీ రేదో నిశ్చయించుకొన్నదాకా మృత్యుదేవత ఆగదు. ఆమె కబళిస్తుంది. అనింద్యచరిత్రగల మీ అన్నగారిలో ఉన్నగొప్పను మీరు గ్రహించుకొని రక్షించుకొనలేకపోతే నేను మౌనమువహించి ఈ సదవకాశాన్ని పోగొట్టలేను. భర్త్రాజ్ఞను తిరస్కరించి అయినా ఈ గోడను ముక్క ముక్కలుగ చేసి తీరుతాను. నాకొఱకు కాదు.

సేర్ :—ఝాన్సీ ! ఈ ఆవేశ మేమిటి ?

ఝాన్సీ :—నా దేశముకొఱకు, కఱువులతో, రోగాలతో, అనుమానాలతో, హింసలతో, విప్లవాలతో, కఠోరశిక్షలతో, తల్లిబిడ్డలను విడదీయు కత్తిసేత. నీచ. క్షుద్రాశయాలతో, దేశము బాధపడకుండ రక్షించటానికి దేవతలు స్వేచ్ఛగాలి హరించే దేశములో రాక్షసులు, భూతాలు, పిశాచాలు ఇష్టమువచ్చినట్లు నృత్యముచేస్తుంటే చూచి సహించలేక.

సేర్ :—ఝాన్సీ ! నీకు మతిపోయిందా ?

ఝాన్సీ :—ఈ గోడ ఛేదిస్తా మళ్ళీ పూర్వ భోగ భాగ్యాలతో దేశము పెంపొందుతుంది.

సోదరుల జీల్చి ప్రజలను వ్రక్క జేసి
భోగ భాగ్యాల హరియించి భూతనృత్య
రంగముగ దేశమును మార్చి ప్రళయరవము
లాడు గోడ ఛేదింప నాజ్ఞ నిడుడు !

సేర్ :—(బొమ్మవలె నిలువబడును)

ఝాన్సీ :—నాథా! రండి, లెండి! ఈ గోడను తుత్తునియలుగా ఛేదించండి. ఈ గోడను ఛేదించగనే ఆ గోడనే పునాదిగ వేసుకొని సౌధశతాలు నిర్మించిన.విదేశీయుల ఆశాసౌధాలన్నీ కూలిపోతాయి. మన దేశాన్ని పీల్చి పిప్పిచేసే కుత్సితరాజకీయవిభేదాలన్నీ ప్రళయకాలాగ్నిలో పడి భస్మమవుతాయి. విదేశీయులు ఆశ్రియము లేకపోవుటవలన చెప్పకుండానే పరారై పోతారు. అసంఖ్యాకములైన కంఠాలు "బోలో! స్వతంత్ర భారత్ కీ జై" అని అరుస్తాయి. అసంఖ్యాకములైన వీరహస్తాలు సునిశితవజ్రాయుధాలను ధరించి ఉజ్వల విజయానికి భేరీల మోగిస్తారు నాథా! ఆలోచించుకోండి. తాత్కాలిక స్వార్థాని కాసించి భారతమాతను నిరంతరదాస్యములో ఉంచి, శాశ్వతావకలానములో ఈ లోకములో జీవించి. శాశ్వతనరకాన్ని పొందటమో; పూర్వభాతృత్వాన్ని స్మరించి, క్షుద్రస్వార్థాన్ని పరాభవించి సౌఖ్యపరంపరలను పొందటమో!రండి! ఈగోడను ఛేదించండి!

గోడకూల్చండి – బాబూ – కీడులడచండి!
గోడుపెంచే మాయగోడను కూల్చివేయండి!

కలతల కన్నింటికి రహదారి
సమతను చించే దీ పింజారీ
దేశదరిద్రతకే మహమ్మారీ
జంకెద రేటికి వేగమెరండీ!

గోడకూల్చండి – బాబూ – కీడులడచండి!
గోడుపెంచే మాయగోడను కూల్చివేయండి!

పరదేశీయులకు భవనంబిదియే
పరవిజయాలకు ఆశ్రియమిదియే
భారతర క్తము త్రాగెడి దిదియే
బాబూ – కూల్చండీ యికరండీ!
గోడకూల్చండి - బాబూ – కీడులడచండి!
గోడుపెంచే మాయగోడను కూల్చి వేయండి.

సేర్:—నా హృదయము పశ్చాత్తాపముతో నిండిపోతోంది. కాని, ఇంతద్రోహముచేసిన నన్ను మా. అన్నయ్యా క్షమిస్తాడా అని నా భయము.

రామచంద్రుని మించి ప్రేమించు సోదరు
నిందించితిని దుష్ట నీచబుద్ధి
జానకి మించిన సహజాతుభార్యను
శంకించితిని మూర్ఖశమనీభండీ
సేవించినను పెంచి సేమంబె వాంఛించు
సేవకద్వయము భక్షించినాడ
విద్వజ్జనంబులు విని విట్టి గర్హించు
భక్తి నిర్మించితి విడచి మమత
పద పదంబున శోధించి భర్త యంచు
జంకకయె సత్యమార్గంబు చాటు నిన్ను
పతిత యనీ తూలనాడితి భ్రాంతమైన
సైచునే యన్నిలోపాల సైపగలడె.

ఝూన్సీ:—అవసరములేదు. వారి హృదయ మమృతభాండము మనలను చూడగనే వారి హృదయము ద్రవించిపోతుంది. 'సేర్ సింగ్' అని మిమ్ములను గాఢాలింగనముచేసికొని ఆనందాశ్రువులతో జలకమాడిస్తారు. రండి, గోడమీాద గునుపపు పోటు విన

బడగానే వారి హృదయములో వీరరసము ప్రవహించి వేరొక వైపునుండి వారు గోడను నిర్మూలిస్తారు. ఇరువైపులనుండి అఘాతాలను తింటూ గోడ క్షణములోనే నామరూపాలు లేకుండా నశిస్తుంది. బోలో, భారతమాతకీ జై.

పతితపావకులైన భ్రాతలు వారలు
సైరింపరే యనుజన్ము తప్పు
సీతామహాసాధ్వి చీకాకు చెందునే
పరవశు లాను దుర్భాష లరసి
సోదరుల్ మెలగిన శుద్ధపావనమైత్రి
మృతులు తోషింపరే మేను మరచి
ఛేదింపబడి గోడ క్షోణిపై దొర్లాడ
బృందారకులు పుష్పవృష్టి నిడరె
సంధియుంబేల శంకల సముయమెల్ల
జారవిడచిన దొరకదు సమయ మిదియ
లెండు గునుపంబు బూనుచు రండు భిత్తి
తునియలుగ జేయ రండు నా మనము పొంగ.

(ఇరువురు వెడలుదురు)

గోడయెగాట ఝూన్సీ, సేర్ సింగులు.

సోదరులారా! భారతీయహృదయాలను విభజించి వానికి శాశ్వతదాస్యము ప్రసాదించే విచిత్రసాధనమే ఈ కుడ్యము. విదేశీయురాజనీతి మహాసముద్రాన్ని స్వార్థనగరాజముతో మథించినపుడు జన్మించిన హాలాహలమే యీ గోడ. భారత దేశాన్ని దోచి విదేశాలను అనర్ఘ్యరత్నాలతో నింపే నౌకయే భిత్తి. ప్రాచ్య పూర్వసాంప్రదాయాలను పరిహసించి నూత్న సాంప్రదాయాల నాహ్వానించి మన నెత్తిపై కెక్కించే

యథార్థ్వయంత్రిరాజమే ఈ శిలాకృతి ధరించిన స్వార్థము. అజ్ఞానాన్ని అహంకారాన్ని జోడించి అర్థములేని అంతఃకలహాలను సృష్టించి శుష్కకంకాలాలతో దేశాన్ని నింపే మహామంత్రిమే యీ రాతికట్టడము కఱువులను, రోగాలను అకాల మృత్యువులను, దారిద్ర్యాన్ని ఆహ్వానించి చిరనివాసమిచ్చే వదాన్యస్వరూపమే యీ శిలాసంఘాతము. రండి, తుత్తునియలుగా చేయండి, విదేశీయులకీ భారతదేశములో అడుగుపెట్టటానికైనా అధికారములేదని భూమిని వారిలే శిలాసంఘర్షణచే ఘోషించి చెప్పండి, రండి! "జైహింద్" నినాదాలతో మీలో ఉన్న క్షుద్రాశయాలను బూడిలో కలపండి!

గేయం

స్వతంత్రభారతి! స్వతంత్రభారతి!
స్వతంత్రభారతి - పిలిచిందే!
పదండిముందుకు - పదండిముందుకు
పదండిముందుకు వీరులారా!

కదంతొక్కుతూ పదంపాడుతూ
కంఠంబెత్తుతు గర్జిస్తూ
శూరతమీరా ధీరతపారా
మాయగోడనే కూల్చేద్దాం!

స్వతంత్రభారతి! స్వతంత్రభారతి
స్వతంత్రభారతి - పిలిచింది!
పదండిముందుకు - పదండిముందుకు
పదండిముందుకు వీరులారా!

ద్వేషమునించే రోషముగూర్చే
శిలాకుడ్యమును ఛేదించి

శాంతినిగూర్చి సౌఖ్యముచేర్చే
మార్గాన్వేషణ చేసేద్దాం!

స్వతంత్రభారతి - స్వతంత్రభారతి
స్వతంత్రభారతి పిలిచింది
పదండిముందుకు పదండిముందుకు
పదండిముందుకు వీరులారా!

సేర్ :—సోదరులారా! మానవులను దేవతలుగా చేసే విశాలార్ద్ర హృదయము, కృతజ్ఞత, వినయము, సానుభూతి మొదలగు సద్గుణాలను నిర్మూలించి. యంత్రములుగా తయారుచేసిన ఈ గోడను నిర్మూలించటానికి పేదలకు, భాగ్యవంతులకు, సమస్త వర్ణాలకు అధికారముంది. రండి! మీ విధ్యుక్తధర్మాన్ని నెఱవేర్చికొని ధన్యులుకండి! బోలో "భారతమాతకీ జై."

(అని గునపముతో గోడను కొట్టుదురు)

(సేర్ సింగు వచ్చి అన్నయ్యపాదాలకు నమస్కరించి) క్షమించు అన్నయ్యా! పాపాత్ముణ్ణి!

(రామసింగు లేవనెత్తి గాఢాలింగనమొనర్చును)

ప్రజలు జేజేలు. గేయం

భారతమాతకు జేజేలు
శూరసమేతకు జేజేలు

కవులనుపెంచిన ఘనతరశోభిత
శూరులగాంచిన యశస్సమేత
జ్ఞానవిభూతికి సరసవిఖ్యాత
పూజితచరిత భావ్యసంపూతా

భారతమాతకు జేజేలు
శూరసమేతకు జేజేలు! (తెర వ్రాలును)

సంపూర్ణము.

# వినువీధి

## (శుక్లపక్షము)

### ఖండకావ్యము

రచయిత:- **శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు**

...... తెలుగు దేశాన్నేకాక యావద్భారత దేశాన్నికలచి కలవర పెట్టే అనేక సమస్యలను ఆధారంగా తీసుకొని రచింపబడిన ఖండ కావ్య సంపుటియే యీ వినువీధి.

...... తేట తెలుగు మాటల్ని ముద్దుగా మూటగట్టే పద్యాలు చదివే సరికి మీరు తన్మయులవుతారు. ఇదే యీ కావ్యంలో వుండే విశిష్టత.

...... హంపీ శిధిలాలు—ఆంధ్రరాష్ట్రం, తెలుగు వీరస్మృతి, ప్రకృతి పరిశీలన— అనేక వివిధ శీర్షికలతో, సర్వజనాకర్షణీయముగా తమ అమూల్యాభిప్రాయాలతో ఆధరణ చూపింతారు.

...... మీరుకూడా ఈ వినువీధి కావ్యాన్ని చదివి మా. సారస్వత కృషికి చేయూత నీయాలని మాఅభికాంక్ష.

తెల్లని కాగితం, ముద్దుగొల్పే గెటప్. మూల్యం 1-0-0.

ముందుగా రూపాయి మణియార్డరు పంపినవారికే పంపబడును.

## కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు

సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమహేంద్రవరము.

---

స్వకీయ శ్రీరాజేశ్వరి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

# భార్యల సమ్మె

(నాటిక)

రచన: **శ్రీకృత్తివాసతీర్థులు**

ఈ నాటకము ఇతివృత్తము చిన్నదయినా సంభాషణలు
ఉజ్జ్వలంగా ఉంటాయి. పాత్రపోషణ, ఉక్తి
వైచిత్రి, నర్మగర్భమైన హాస్యము, గమ్య
మైన శైలి, అందమైన పాటలు నాటి
కలో ప్రముఖంగా ఉన్నాయని డాక్టర్
పట్టాభి, ఆచార్య రంగా మొదలైన
ప్రసిద్ధులు విమర్శించారు, ప్రద
ర్శనానికి చాలా అనుకూల
మైన నాటికరాజము.
త్వరపడుము.

మూల్యం 1 రూపాయి.

డబ్బు మనియార్డరు పంపినవారికే పంపబడును.

వలయువారు :

**కాళహస్తి తమ్మారావు అండు సన్సు**

గ్రంథ ప్రకాశకులు :: రాజమహేంద్రవరము

# స్టేజిడ్రామాలు

| | | | | |
|---|---|---|---|---|
| వీరాబాయి | నా॥ నా॥ | 1 | 4 | 0 |
| బాలనాగమ్మ | చె॥ కే॥ | 1 | 4 | 0 |
| రౌడీ | నా॥ గో॥ | 1 | 4 | 0 |
| అహల్య | మ॥ అ॥ | 1 | 8 | 0 |
| తాజ్‌సేజ్ | అ॥ నా॥ | 1 | 8 | 0 |
| దీవార్ | ,, | 1 | 8 | 0 |
| చరణదాస్ | ,, | 1 | 8 | 0 |
| మహారాజ్ శివాజి | ,, | 1 | 8 | 0 |
| భక్తపోతన్న | అ॥ వి॥ | 1 | 8 | 0 |
| భక్తత్యాగయ్య | ,, | 1 | 8 | 0 |
| మైరావణ | ,, | 1 | 8 | 0 |
| ప్రచండభీమకవి | ,, | 1 | 8 | 0 |
| భార్యలసమ్మె (ఏకాంకిక) | కృ॥ తి॥ | 1 | 0 | 0 |
| నర్తనశాల (ఏకాంకిలు) | సా॥ జో॥ | 1 | 0 | 0 |
| మళ్లీపెళ్లి | పి॥ వీ॥ | 1 | 4 | 0 |
| వీరతానాజీ | చు॥ సు॥ | 1 | 0 | 0 |

దొరకుచోటు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు

సంస్కృతాంధ్ర బుక్‌డిపో, రాజమహేంద్రవరము.